## బతుకు భయం

ఆదాయాలు నాయకులిచ్చే వాగ్దానాలవుతున్నప్పుడు
అవసరాలు ఖాళీ డబ్బాల్లా ఎదురవుతాయి
వాయిదాల మీద తెచ్చుకున్న వస్తువులిప్పుడు
గొంతు కడ్డం పడతాయి

టీ. వీ. తెర మీద వార్తలకు బదులు
వాయిదాల తేదీలు కనిపిస్తాయి

వాయిదాల మీద తింటూ
వాయిదాల మీద కూర్చుంటూ
వాయిదాలను ధరిస్తూ

వాయిదాల కప్పగించి వేశాం
కటింగులు పోను చేతి కొచ్చేది
వృత్తి పే స్లిప్పే
అప్పుకు అందమైన పేరు వాయిదా
జీవితం వాయిదాల మీద
దఫ దఫాలుగా హరించుకు పోతున్నప్పుడు
అవసరాలు కూడా సౌకర్యాలుగా మారేటప్పుడు
అడుగడుగునా బతుకు భయం
బిడ్డల్ని కనడం కూడా నేరం
ఇంటికొస్తే సంతోషాన్నిచ్చే
ఆ కొద్ది క్షణాలు కూడా కాలి
బూడిద కుప్పై మిగుల్తాయి
అన్నీ భయాలే
అప్పుల భయం
వాయిదాల భయం
ప్రశ్నించడం భయం
రేపు భయం
రాత్రి భయం
బతుకు భయం

— బి. రామానాయుడు

( విశాఖ షిప్ యార్డు కార్మికులకు అంకితం )




సంపుటి : 16 సంచిక : 3
జనవరి 1993

ముఖ చిత్రం :

కాతోజు

రచనలు పంపవలసిన చిరునామా :

**నిర్మలానంద,**
వర్కింగ్ ఎడిటర్,
29-28-67, దాసరివారివీధి,
సూర్యారావు పేట,
విజయవాడ - 520 002.

**మేనేజర్, ప్రజాసాహితి,**
29-28-67, దాసరివారి వీధి,
సూర్యారావు పేట,
విజయవాడ-520 002.

ఏజంట్లు, చందాదారులు
వ్రాయవలసిన అడ్రస్,
ఇతర వివరాలకు :
**కొత్తపల్లి రవిబాబు,**
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, నగరం-522 268.






వెల : రూ. 5 సం॥ చందా రూ. 50
ప్రత్యేక సం॥ చందా రు. 100

## ఈ సంచికలో ...

# సంపాదకీయం

## మతోన్మాదాన్ని ఓడించండి!

## మానవత్వాన్ని నెలకొల్పండి!!

పాము తన సంతానాన్ని తానే తింటున్నట్టు మానవుడు తన జాతిని తానే బలి తీసుకుంటున్నాడు. వేల సంవత్సరాల సంస్కృతీ, నాగరికతా, ప్రేమ, కరుణ గాలిలో క[illegible] నూతన సంవత్సరాన్ని 'పగాద్వేషపు' సంవత్సరంగా, 'రక్త దాహపు' కా[illegible]గా హిందూ మతోన్మాదులు మార్చేస్తున్నారు. సూరత్‌లో జరిగినదీ, గుజరాత్ ం[illegible]ం, బొంబాయి నగరంలో జరుగుతున్నదీ ఇదే. దేశవిభజన కాలం నాటి మత దురంతాలు మారిన పరిస్థితులను బట్టి మరింత అసభ్యంగా పునరావృత మవుతున్నాయి. ఈ దాడులలో, 'శాంతి భద్రతల' యంత్రాంగపు 'నిష్పాక్షిక' ప్రవర్తనలో మైనారిటీ వర్గాలే ఎక్కువగా బలవుతున్నాయి !

'నిర్బంధమూ, సంస్కరణలూ' అనే రెండంచుల కత్తితో పరిపాలకులు కొంత కాలం తమ విధానాల్ని అమలు పరిచారు. కానీ ఆర్థిక, రాజకీయ సంక్షోభం, సామాజిక ఉద్రిక్తతలు తీవ్రమవుతున్న కొద్దీ అతి స్వల్పమైన చిట్టి పొట్టి సంస్కరణలు కూడా వదిలేసి, ప్రజల్ని పక్కదారి పట్టించడాన్నీ, వంచనా శిల్పంతో మోసం చేయడాన్నీ, విద్వేష భావజాలాన్ని వ్యాప్తి గావించడాన్నీ ఒక కళగా, విధానంగా అభివృద్ధి చేసుకున్నారు. ప్రభుత్వ హింసతోపాటు, ప్రైవేటు హింసను పకడ్బందీగా వ్యాప్తి చేస్తున్నారు.

హిందూ మతోన్మాద భావజాలం, పరమత ద్వేషపూరితమైన విషప్రచారం, ప్రజలలో అవిశ్వాసాన్ని అప నమ్మకాన్నీ పెంచి ఇతరులపై గుడ్డిగా దాడులు చేయటానికి కావల్సిన సాంస్కృతిక వాతావరణాన్ని పెంచుతున్నాయి. రచయితలూ, పత్రికల సంపాదకులూ, మేధావులనే విచక్షణ కూడా లేకుండా లూటీలూ, దహనాలూ జరిగిపోతున్నాయి.

మనిషిని మించిన దేవుడూ లేడు....అతనికి మించిన రాక్షసుడూ లేడు. రాక్షసతత్వాన్ని ప్రకోపింప జేస్తున్న సామాజిక పరిస్థితులూ, దాని ఏలికలు, వ్యాపింప చేస్తున్న ఉన్మాద, విద్వేష పూరిత భావజాలం మనిషిని కర్కశహృదయునిగా, రక్త పిపాసుడుగా మారుస్తున్నాయి.

అద్వానీ రథయాత్రలకు పూర్వం చెదురు మదురుగా మత కలహాలు జరిగినా, తదనంతరం నుండే అవి విచ్చలవిడిగానూ, విస్తృతంగానూ సాగుతున్నాయి. ఇప్పటికే అనేక వేల మానవ ప్రాణాలను బలితీసుకున్నాయి. చరిత్రకు మాయని మచ్చలా, మానవత్వానికే కళంకంగా ఈ క్షణానికీ అవి కొనసాగుతున్నాయి.

45 సంవత్సరాల కాంగ్రెసు పరిపాలన నిజమైన సెక్యులర్, ప్రజాస్వామిక విలువలను వ్యాప్తి చేయకపోగా తన అధికార కాంక్షకు కుల, మత, ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టి, అరాచక శక్తులను, మాఫియాలను, పరమ నికృష్టమైన అవినీతిపరులను, సంఘ విద్రోహులను, డబ్బు పిచ్చగాళ్ళను వ్యాప్తి చేసింది. నేరస్త ముఠాలను నిర్మాణయుతంగా నిర్వహిస్తూ వచ్చింది. పోలీసు యంత్రాంగాన్ని ఆదేవిధంగా తీర్చి దిద్దింది. పాలక రాజకీయ గ్రూపులన్నీ తరతమస్థాయిల్లో వీటిని పెంచి పోషించుకుంటూవస్తున్నారు.

హిందూ మతోన్మాద, విద్వేష పూరిత కార్యకలాపాలు నేరస్త ముఠాలకు బాగా ఆదునుగా దొరికాయి. మైనారిటీలు ఎక్కువగా వుండే మురికి వాడలమీద దాడులు చేయటం, తగుల బెట్టటం....వారు భయపడి ఇళ్ళు వదిలి పారిపోయేట్టుగా అత్యాచారాలు సాగించటం ఒక పథకం ప్రకారం చేస్తున్నారు. ఒక్క బొంబాయి నగరంలో ప్రభుత్వం ప్రకటిస్తున్న లెక్కల ప్రకారం 200 మందికి పైగా హతులైనారు. అది అనేక రెట్లు ఎక్కువ వుంటుందని మనకుతెలుసు! ఇళ్ళు వదిలి పారిపోవటానికి పదివేలమందికి పైగా బొంబాయి సెంట్రల్ స్టేషన్‌లో పడిగాపులు పడి వున్నారు. ఈ గడ్డమీద పుట్టటం తాము చేసుకున్న "మహా పాపం" అని కొంత మందైనా భావించే దుస్థితిని కల్పించటం కంటే మించిన దేశ ద్రోహం మరొకటుందా ?

'నిజంగా ఈనాటి పరిస్థితి మానవత్వానికీ, లౌకిక తత్వానికీ, ప్రజాస్వామిక వాదులకు సవాలు వంటిది. పై విలువలపట్ల విశ్వాసమున్న రచయితలకు, కళాకారులకు, సాంస్కృతికోద్యమ కార్యకర్తలకు అత్యంత అవమానకరమైనది. సమాజాన్ని ఈ విపత్కర పరిస్థితుల నుండి బయట పడవెయ్యటానికి వారు నిజాయితీగా ముందుకు రావాలి.

భారతీయ సంస్కృతిలోని మానవీయ విలువలనూ, లౌకిక ప్రజాస్వామ్య భావాలను వ్యాప్తిలోకి తేవాలి. పరిస్థితుల్ని అర్థం చేసుకోవటంలోనూ, అంచనా వేయడంలోనూ స్వల్పమైన విభేదాలూ, తేడాలు వుండినా తాత్కాలికంగా వాటిని పక్కన బెట్టి మౌలికమైన విలువల పరిరక్షణకోసం, పాసిస్టు తత్వాన్ని నిరోధించి, శాంతి సామరస్యాలను నెలకొల్పటం కోసం తమ వంతుగా కృషిచేయటానికి ముందుకు రావాలి.

ఏ విషాద పరిస్థితులైతే తిరిగి తలెత్త కూడదని మన ముందుతరాలవారు. దేశ విభజన కాలంనాటి భయానక పరిస్థితులకు వ్యతిరేకంగా జరిపిన పోరాటాన్నీ, కృషినీ ఆవాహన చేసుకొని చురుకుగా కదలటం నేటి మన కనీస బాధ్యత. కలసి, వచ్చే వ్యక్తులనూ, సంస్థలనూ 'ఐక్య కార్యాచరణ'లోకి తీసుకు వచ్చి ముందుకు నడిపించటం విప్లవ సాంస్కృతిక శక్తుల తక్షణ కర్తవ్యం.

# మధురవాణి బహుళ ప్రయోజనాత్మక చర్యలు

— యస్. మనోహర్

మధురవాణి గురజాడ కీర్తిపతాక. గురజాడ నాటక శిల్పమంతా మధురవాణి పాత్రలో ప్రతిబింబించింది. మధురవాణి 'కన్యాశుల్కం' నాటకానికే ఇరుసు. ఆమె చక్రం అడ్డు వేయకపోతే చాలా మంది అభాసుపాలయ్యేవారు. మధురవాణి లేని కన్యాశుల్క నాటకాన్ని ఊహించలేం. మధురవాణి నాటకంలోని ఊపుకు, వేగానికి ముగింపుకు చోదకశక్తి. గిరీశం మధురవాణిని రంగు వేసిన గాజు ప్లాస అన్నా ఆమె పాత్రలన్నింటిలో ప్యూర్ డైమండ్. మధురవాణే లేకపోతే కళింగ రాజ్యాని కేమోగాని, తెలుగు నాటకానికి మాత్రం తీరని నష్టం వాటిల్లేది. ఆమె నాటకం నిండా పాదరసంలా పాకిన పాత్ర ఆమె నాటకంలో ఒక్క ద్వితీయాంకంలో తప్ప అన్ని అంకాల్లో శృంగార రసాధి దేవతలా, నవ్వుల రాణిలా, విషాద మూర్తిలా, మెరుపు తీగలా, వెన్నెల జల్లులా, రౌద్రంలా, కారుణ్యంలా, కన్పించి కథా గమనాన్ని ఎన్నెన్నో మలుపులు తిప్పింది. నాటకంలో ఆమె కనిపించే దృశ్యాలకు ఒక ప్రత్యేకత వుంది. గురజాడ తన నాటక కళా ప్రజ్ఞనంతా మధురవాణి మధురవాణిపాత్రకు రూపు రేఖలిచ్చి, ప్రాణ ప్రతిష్ట చేయడానికే వినియోగించాడు. మనం మధురవాణిని ఏ విధంగా భావిస్తే ఆమె అట్లాగే కనిపిస్తుంది. మధురవాణి జీవంతో తొణికిసలాడే సజీవ పాత్ర. ఎన్నిసార్లు, కన్యాశుల్కం చదివితే అన్నిసార్లు మధురవాణి అనేక రకాలుగా కనిపిస్తుంది. ప్రపంచ సాహిత్యంలోనే అరుదుగా కనిపించే పాత్రలన్ని 'మధుర వాణి' పేర్కొనదగింది.

కొడవటిగంటి కుటుంబరావు ఒక చోట యిలా అంటాడు. "మధురవాణి చేసే ప్రతి చేష్టా బహుళ ప్రయోజనం కలది" కన్యాశుల్కం చదువుదామని పేజీలు తిప్పుతున్న ప్రతిసారి కొ. కు. మాటలు నా చెవుల్లో గుస గుసలాడుతాయి. ఆ దృష్టితో మధురవాణి చేష్టల్ని పరిశీలించటం ఈ సంక్షిప్త వ్యాసోద్దేశం.

కన్యాశుల్కం నాటకంలో మధురవాణి 'చిత్ర'మైన బాధ్యతలు నిర్వహించింది. (మధురవాణి నాటకం ముగిసేలోపల ఎన్నిసార్లు 'చిత్రం' అని పలికిందో లెక్క పెట్టటం, ఆ మాట అనడంలో ఆమె అంతర్యం — ఈ అంశాన్ని కూడా పరిశీలించాల్సిందే ! ఆ పని యింకో వ్యాసం ద్వారానే సాధ్యమౌతుంది.) మధుర వాణి చర్యల్లో అగ్గిపుల్ల వెలిగించడం, తలుపు తీసి సట్టుగాని వెంకో [illegible]లుతో దారి చూపటం, కరటక శాస్త్రి శిష్యుణ్ణి ముద్దు పెట్టుకోవడం, తాళాల గుత్తితో రామప్ప పంతుల్ని కొట్టడం, సిరా బుడ్డిలోని సిరా అంతా రామప్పపంతులు మొహం మీద పోయడం, కొట్టు గదిలో పేకాట ఆడే సీనులో దీపాలు ఆర్పడం మొదలైనవి నాటకాభినయాంశాలే గాక బహుళ ప్రయోజనాన్ని కూడా సాధించాయి.

## ఒకటి

నాటకం ప్రారంభమైంది. గిరీశం ద్వారా మధురవాణిపరిచయం ప్రేక్షకులకు తెలుస్తుంది. మధుర వాణిని ప్రథమాంకం రెండవ స్థలంలో చూస్తాం. అది మధుర వాణి గది. రామప్ప పంతులు కుర్చీలో కూర్చొని వుంటాడు. రామప్ప పంతులు మధురవాణిని వుంచుకోడానికి అన్ని ఏర్పాట్లు పూర్తయ్యాయి. రామప్ప పంతులు చుట్ట కొస కొరికి మధురవాణ్ణి అగ్గి పుల్ల అడుగుతాడు అదీ సందర్భం. మధురవాణి అగ్గి పుల్ల వెలిగించడం రామప్ప పంతులు కోసమే అనేది మనకు కనిపిస్తున్న చర్య, ఆమె అగ్గి పుల్ల వెలిగించినప్పుడు "మధురవాణి వెలుగుల మొగ్గలా కనిపిస్తుంది. మధురవాణి నిప్పులాంటి వ్యక్తిత్వం కలదనే భావం స్ఫురిస్తుంది. మధురవాణి అగ్గి పుల్ల వెలిగించినపుడు మౌఢ్యాంధకారంలోకి కాంతి రేఖలు పంపుతున్నదా! అని అనిపిస్తుంది. మొగ్గలా ఉన్న అగ్గి పుల్ల చిరు జ్వాల మహోజ్జ్వల నాటక కాంతి ప్రవాహం యొక్క సూక్ష్మ రూపమా అన్నట్లుంది !
ఈ సన్నివేశాన్ని చూద్దామా !

( రామప్ప పంతులు కుర్చీ మీద కూర్చుండును. మధురవాణి మొదట కూర్చుండును. )

రామ :- (జేబులోంచి చుట్ట తీసి పంట కొస కొరికి )
పిల్లా ! అగ్గి పుల్ల.
( చాలా మంది నటులు 'పిల్ల ! అగ్గి పుల్ల' అనటం తొందరలో పుల్ల ! అగ్గి పిల్ల అని వాచకం చెప్పినట్లు ప్రచారంలో వుంది — 'మధురవాణి' 'అగ్గి పిల్ల' కాక మరేమౌతుంది. — వ్యాసకర్త )

మధురవాణి :- ( అగ్గి పుల్ల వెలిగించి చుట్టకందించుచుండగా రామప్ప పంతులు మధురవాణి బుగ్గ గిల్లును. మధుర వాణి చుట్ట కాలకుండానే అగ్గిపుల్ల రాల్చి యెడంగా నిలబడి కోపం కనపర్చుతూ )
మొగాడికయినా ఆడదానికయినా నీతి వుండాలి ....

## రెండు

మధురవాణి గిరీశాన్ని పొగుడుతుంది. తనను యిన్నాళ్ళు అతనే పోషించాడని చెబుతుంది. రామప్ప పంతులుకు యిది సుతారమూ యిష్టముండదు. రామప్ప పంతులు గిరీశాన్ని ఎద్దేవా చేసి మాట్లాడుతాడు. మధురవాణికి కోపం వస్తుంది. ఒకటి రెండు మాటలు మిగల్చనిచ్చి కోపంతో తలుపు తీసి వక చేత పట్టుకొని రెండవ చేతి వేలుతో పైకి తోవ చూపి పొమ్మంటుంది — వెంటనే గిరీశం వస్తున్నట్లు అభినయించి అతనితోనే ఆ విషయాలు చెప్పమని అంటుంది.

మధురవాణి తలుపుతీసి వకచేత్తో పట్టుకొని ఇంకో చేతి వేలుతో పొమ్మనే ఈ చర్య మధురవాణి కోపాన్ని ప్రకటిస్తుంది. నాటం పరిభాషలో యిది హస్తాభినయం, అంగికం అంటారు. ఈ సన్నివేశంలో క్రోధాన్ని భ్రూ విక్షేపాదులతో కూడా చూపటానికి వీలుంది. తలుపుతీసి వకచేత పట్టుకొని మరోచేతి వేలితో పైకితోవ చూపటం కేవలం అభినయ చేష్టగానే కనిపిస్తుంది. మధురవాణి రామప్ప పంతులును బయటకు వెళ్ళమని తలుపు తీసిందని పాఠకునికి, ప్రేక్షకునికి తెలుస్తూనేవుంది. మధురవాణి ఈ 'చర్య'లో యింకో ప్రయోజనం కూడా వుంది.మధురవాణి తానుంచు కున్నవాణ్ని తాను తెగతెంపులు చేసుకునేదాకా విశ్వాస గౌరవాలు మనస్ఫూర్తిగా ప్రకటిస్తుందని రామప్పపంతులు గ్రహించడానికి ఈ చర్య ఉపకరిస్తుంది. నాటక ప్రదర్శన పరంగా కూడా యింకో ప్రయోజనంవుంది గిరీశం మధురవాణి యింట్లోకి రాకుండానే అతడు వస్తున్నట్లు రామప్పపంతులుకు, ప్రేక్షకులకు తెలియడానికి ఈ 'చేష్ట' సహాయపడుతుంది. రామప్పపంతులు గిరీశం మీద అవాకులు చవాకులు పేల కుండా జాగ్రత్తపడటానికి కూడా ఈ చర్య ఉపకరిస్తుంది.

**ఈ సన్నివేశం :**

రా. పం :- వీడెవడో మా గొప్పవాడనుకుంటున్నావేమిటి ?

మధురవాణి :- అయన్ని నా యెదట దూల్నాడితే యిదిగో! తలుపు తీశాను. విజయం చెయ్యండి.

(తలుపు తీసి వక చేత పట్టుకొని రెండవచేతి వేలుతో పైకి తోవ చూపును) అదిగో గిరీశంగారే వస్తున్నారు. ఆ మాటేదో ఆయన్తోటే చెప్పండి.

మూడు

కరటకశాస్త్రి 'సుబ్బి పెళ్ళి' తప్పించటానికి వ్యూహం పన్నాడు. శిష్యుడికి కూతుర్నిచ్చి పెండ్లి చేస్తానని వాగ్దానం చేసి కన్య వేషం వేయించి రామప్ప పంతులు యింటికి వస్తాడు. కరటకశాస్త్రి చిన్న కత్తెరగడ్డం పెట్టుకొని గుంటూరు శాస్త్రులు వేషంలో వుంటాడు. కరటకశాస్త్రి మధురవాణ్ణి చూసి మహదాశ్చర్య పోతాడు. తర్వాత సుబ్బిపెళ్ళి తప్పించమని ప్రాధేయపడే దృశ్యంలో మధురవాణి కన్యా వేషంలో శిష్యుణ్ణి చూసి ముచ్చటపడింది. అడది మెచ్చిందే అందం అంటూ మధురవాణి కరటకశాస్త్రి శిష్యుణ్ణి 'ముద్దు' పెట్టుకొంటుంది. మధురవాణి కరటక శాస్త్రి శిష్యుణ్ణి ముద్దు పెట్టుకొనే చర్య బహుళ ప్రయోజనాన్ని సాధించింది. మధుర వాణి ముద్దుకు ఇక్కడ రెండు ప్రయోజనాలు కనిపిస్తున్నాయి. మొదటిది: కరటక శాస్త్రి శిష్యునికి అమ్మాయివేషం వేసిన సంగతి మధురవాణికి తెలియాలి. రెండవది: గురువుగారి చుట్టలు డబ్బిలోంచి కరటకశాస్త్రి శిష్యుడు కాజేయడం తెలియాలి. ఈ 'చర్య' ద్వారా పూర్వరంగంలో కరటకశాస్త్రి, కరటకశాస్త్రి శిష్యుడు కలిసి పన్నిన 'వ్యూహం' పునరుక్తి కాకుండా తోడ్పడింది. దీనివల్ల నాటకానికి చక్కని

బిగువు వచ్చింది. మధురవాణి నవ్వేకంటే మధురవాణి ముద్దు చాలా పదునైనది. ఆమె ముద్దు ద్వారా సాధించిన ప్రయోజనాల తీరు అద్భుతమైనది.

**ఈ సన్నివేశం ఒప్పుకు :**

మధురవాణి :- యేం నంగనాచివే! తరవాత పెళ్ళిచేసుకుంటాను అందాక ముద్దియ్యి (ముద్దెట్టుకొనును.)

కరటకశాస్త్రి :- నేరని పిల్లని చడగొడుతున్నావు.

మధురవాణి ,- నాలాంటి వాళ్ళు నూరుమందికి నేర్పి చడగొట్టగలడు. ఈ కన్నెపిల్ల నోరు కొంచెం చుట్టవాసన కొడుతుంది.

కరటకశాస్త్రి :- అంచేత కాబోలు, డబ్బీలో చుట్టలు తరచూ మాయమౌతుంటాయి.

నాలుగు

కరటకశాస్త్రి, కరటకశాస్త్రి శిష్యుడు, మధురవాణి సంప్రదింపులు అయ్యాక రామప్పపంతులు వస్తాడు. కరటకశాస్త్రి గుంటూరు శాస్త్రిలుగా తనను తానే (స్వ)పరిచయం చేసుకుంటాడు. ఈలోపల జవాను డబ్బులు యిప్పించండని బయట నుండి కేకేస్తాడు.రామప్ప పంతులు మధురవాణిని డబ్బులు యిప్పించమంటాడు. మధురవాణి రామప్పపంతులు యిచ్చిన డబ్బులు వాళ్ళమ్మకు పంపానని చెబుతుంది. రామప్పపం అ మాటల్ని నమ్మడు. పైగా అబద్ధాలంటాడు. మధురవాణికి చిర్రెత్తింది. ఆమె కోపంతో తాళాల గుత్తి మొలలోంచి తీసి రామప్పపంతులుమీద విసిరేస్తుంది. తాళాలగుత్తి రామప్ప పంతులు మీదికి విసిరివేసే ఈ చర్య మధురవాణి కోపానికి పరాకాష్ట. కరటకశాస్త్రి అతని శిష్యుని ముందు ఆమె అహం దెబ్బతిన్నది. అందుకే ఈ చర్య మరో ప్రయోజనాన్ని నెరవేర్చింది.

తాళపుగుత్తి విసిరేయడంలో యింకో ప్రయోజనం కూడా వుంది. మధుర వాణికి లుబ్ధావధానులు పెళ్ళి చేసుకోవడం యిష్టంలేదు. కరటకశాస్త్రి సుబ్బి పెళ్ళి తప్పించే ప్రయత్నంలోనే మాయ సుబ్బితో ఆమెను ఆశ్రయించాడు. తాళపుగుత్తిని విసిరే చర్యలోని ప్రయోజనం రెండురకాలు.

ఒకటి :- మధురవాణి కార్యసాధన మీద కరటక శాస్త్రికివిశ్వాసం కలగాలి.

రెండు :- రామప్ప పంతులు మధురవాణి చేతిలో కీలుబొమ్మని కరటక శాస్త్రి భావించాలి. మధురవాణి సాధికార సామర్థ్యం తేటతెల్లం కావాలి.

మధురవాణి "తాళపు గుత్తి చర్య" వల్ల రామప్ప పంతులుకు మధురవాణి కోపం కనిపించగా, కరటకశాస్త్రికి అతని శిష్యునికి మధురవాణికి రామప్ప పంతులుపై ఉన్న అధికారం, చొరవను తెలియజేస్తుంది.

(తరువాయి 40వ పేజీ)

# ఇదే నా వీడ్కోలు
# ఇవే నా ఎదురు చూపులు

ఇదే నా వీడ్కోలు
కన్నా! నువ్వెళ్ళి రార విప్లవాల దారులంట
ఇవే నా ఎదురు చూపులు
కన్నా! నువు తిరిగి రార విప్లవ విజయాల వెంట.

నాగేటి చాలు పేగులంట నీ రూపును కంటాను
ఉడుపు లుడిచి నపుడు నీ రూపుకు చను గుడుపుతాను
చేను కోతలపుడు నీ త్యాగాలను పాడతాను
పంట నూర్పిలపుడు నీ జ్ఞాపకాల జోగుతాను.
ఇదే నా వీడ్కోలు
కన్నా! నువు కలిసిపోర విప్లవ ఆచరణ లంట
ఇవే నా ఎదురు చూపులు
కన్నా! నువు నిలిచిపోర విప్లవాల కాల మంత.

కసవూడ్చ పశువుసాల నీ యూపు చూపు అడ్డంరా
కళ్ళాపి జల్ల కంట నీరు నీ బతుకు చూపు బొమ్మెరరా
కూడు తింటు కన్నా! నా పేగు నీకు కుడుపుతాను
కునుకు తీస్తు కన్నా! నా కలలో నిను జోగొడతాను
ఇదే నా వీడ్కోలు
కన్నా! నువు కదలిపోర విప్లవాల బాట లంట
ఇవే నా ఎదురు చూపులు
కన్నా! నువు పెరిగి పోర విప్లవోద్యమాల వెంట.

నీరు తోడె బావిలోన నీ భవితను కంటాను
గరిక తవ్వె బొరిగె మీద నీ బొమ్మను చూస్తాను
స్థానిక పోరాటాల చేరి, తండ్రీ! నిను కలుస్తాను
సాయుధ పోరాటాల చేరి, తండ్రీ! నిను కనుగొంటా
ఇదే నా వీడ్కోలు
ఇవే నా ఎదురు చూపులు.

సూర్య తేజ

వ్యంగ్యం :

# నాను సెపుతున్నాను యినుకో !

మావా !

బావను 'దింపేసి' నువ్వొచ్చేసినావు. యింకా నయం.... 'సంపేసి' రానేదు. నువ్వు సానా మంచోడివి. పూర్వ కాలం రాజులు ఒకడిని సంపేసి ఒకడు సింహాసనం ఎక్కేవోడు. ఆళ్ళు మనలాగే బావలు, మావలు, అన్నలు, తమ్ముళ్ళు .... వగైరా వగైరా.... అంతా ఒకే జాతి, ఒకే రక్తం.... అయినా సరే బంధుత్వం కంటే 'సింవాసనం' సానా గొప్పది. దాని ముందు ఎవుడయినా దిగదుడుపే. మనం యిప్పుడు 'నాగరీకులం' కాబట్టి....అలాంటి మూర్కపు రాజుల్లాగా సంపుకుని సింవాసనానికి రాటం నేదు- ఎంతయినా పెజాస్వామ్యం గదా... ఈమాత్రం 'యిలువలు' డెవలెప్ అయి మనం 'సంపుకోటం' మాని 'దింపుకోటం' మొదలెట్టాం. అంతకీ సావాలనుకుంటే, సావులే కోరుకుంటే మన పేరు సెప్పి జనాన్ని .... నోరు వాయి లేని బీద బిక్కి జనాన్ని .... సంపుకు సావమని సొతంత్రం యిచ్చేత్తాం ! తప్పు తప్పు.... యిచ్చేసాం ! !

ఇంతకీ నాను సెప్పేదేంటంటే మనం 'డెవలప్' అయిపోయినట్టే మరోపక్క జనం కూడా 'డెవలెప్' అయిపోతన్నారు. ఆళ్ళకీ మన రాజకీయాలు తెలిసిపోనాయి. సింవాసనం ఎవుడెక్కినా - అంటే 'మావ' ఎక్కినా, 'బావ' ఎక్కినా — ఎవుడయినా ఒకటేనని జనం మన్నెప్పుడో తీసి కొట్టేసినారు.

యింతకీ నేనేటో సెప్పాలని మొదలెట్టి యింకేటేటో సెబుతున్నాను. అన్నట్టు గురుతుకొచ్చినాది. నువ్వు కుర్సీ ఎక్కినాక నిన్ను పలకరిచ్చలేదు గందా — అంచేత యీ రకంగ పలకరిచ్చాను.

అసలు నేనేటి సెప్పాలనుకున్నానంటే- నువ్వొచ్చి రాటంతోనే "సారా" ఉద్దెమం తేల్సిత్తానన్నావు. అఖిలపచ్చం మీటింగులెట్టి అందరితోటి సెర్చించి మరీ జాగర్తగా పెరిస్కారం సేత్తానన్నావు. నువ్వేటి సెయ్యవని.... సెయ్యనేవని .... నాకు తెల్సు. నాకే కాదు సానా మందికి తెల్సు. కాని నానయితే నీలాగ అనేవోడిని కాదు— అయినా నాను నీనాగ ఎందుకవుతానులే ! అలా అన్నానని నువ్వేటీ రాజకీయం సెయ్యమాక ! యీ 'యదవ రాజకీయాలతో' మన నీడనే మనం నమ్ముకోనే కండా బతుకుతున్నాం. నాను నీకు ఎన్నటికి అడ్డురాను. నిన్ను దింపేసో, సంపేసో నీ సింవాసనం కాజేత్తాననుకోబోక ! నానేదో మాటవరస కన్నానంతే ! .... నాను నీ 'తానం'లో ఉంటే సారా ఉద్దెమానికి నా ఫుల్ సపోరిటిచ్చేసే వోడిని. "ఆలోసిత్తాను".... "మీటింగు లెడతాను".... అనే వోడినికాదు. నాను సారా యాపారం

నడుపుతున్నా సరే — నాకు నట్టం వచ్చినా సరే .... నాను నీనాగ నాయకుణ్ణయితే మాత్రం 'పె. సా. దు.' ల్ని ఎత్తించేసేవోడిని.

అసలు మీరెన్నాళ్ళు రాజకీయాలు నడిపినా మీకీ ఇసయాలు ఎందుకుతెలవ్వో నాకరదం కాదు. జనం ఒద్దంటన్న ఆటిని మనం అంటి పెట్టుక్కూకోకూడదు. సారా ఎత్తేత్తే మనకేటి నట్టం. మనం సారా తయారు సేసుకోటానికి, అమ్ముకోటానికి మనకెన్ని దొంగ దారులు నేవు! నాన్నీ మేనల్లుడినే గందా .... నాసు నా యిట్టమొచ్చిన దారిలో 'సారా' అమ్ముకుంటే నువ్వొద్దంటావా సెప్పు?.... ఏదో సూసీ సూడనట్టు వొదిలేత్తావు గదా! యిలాంటి 'మంచి పనే' .... దొంగ యాపారమో, పత్తు మందుల తయారీయో .... నీ తోడల్లుడే సేయటం మొదలెడితే సుప్పూ కాదంటావా సెప్పు? మరి గందుసేత మనం మనం సేసుకునేయి, సూసుకోనేయి సానావున్నాయి. ఈదేశానికి సొతంత్రం ఒచ్చిన కాడినుంచీ ఉంటూనే ఉన్నాయి. ఈ మాతరం దానికి పెజల దుట్టిలో మనం సెడ్డోళ్ళమయిపోతే ఎలాగ?

ఇదుగో మావా! నాను సెపుతున్నాను యినుకో - జనానికి ఎక్కడ 'యీకు పాయింటు' ఉంటాదో అక్కడ నొక్కేయాల. అంతగా ఆళ్ళు 'సైతన్య' వొంతులయిపోయి 'ఫలానాయి' మాకొద్దు మొర్రో అంటే ఆటని మనం ఎంటనే ఎత్తేయాల. అప్పుడు ఆళ్ళ దుట్టిలో మనం దేవుళ్ళమయిపోతాం. సారా అమ్మొద్దంటున్నారు గాని — 'తాగం' అంటం నేదు గందా! ఇదంతా ఆడకూతుళ్ళ 'సారో'. మరి మగరాయుళ్ళని పక్కదారి పట్టించే దిక్కుమాలిన పెయత్నాలన్నీ మనం సేసుకోవాల — ఇంతకీ ఆళ్ళు కూడా తాగమనే రోజు రాత్తే — అప్పుడు సూసుకుందాం!

అందుసేత నాను సెప్పేది యినుకో —

జనం సారా వొద్దంటే 'సెబాస్! అలాగే ఎత్తేద్దాం' అనాల.

ఎబిచారాన్ని 'సట్టబద్దం' సెయ్యమంటే—'ఎర్రీగుడ్' అని సేసిపారెయ్యాల. అసలు ఎబిసారమే వొద్దంటే — అది ఏరే సంగతి — పైన ఆ ఏడుకొండలవాడే సూసుకుంటాడు.

బూతు సినిమాలొద్దంటే — 'బేసుగ్గా ఉం'దని మెచ్చేసుకోవాల. ఎంటనే పదీ రోజులు బూతు సినిమాలాపించేయాల. పదకొండో రోజున పచ్చి బూతు సినిమాలు దింపేసినా మరేం ఫరవానేదు. యింతలో జనం 'సైతన్యం' సిరుగారిపోద్ది. ఆళ్ళ మళ్ళీ సంగారెట్టి జనాన్ని పోగేసేసరికి మన పుణ్యకాలం ఐదేళ్ళు అయిపోద్ది. ఆతరవాత్తిప్పలు తరవాతోళ్ళు సూసుకుంటారు.... యిలాంటి ఇసయాల్లో మనం ఎనకాడాల్సిందేటి నేదు. జనం ఒక దారిలో బాగుపడిపోతుంటే — సెడగొట్టానికి మనం ఏరే దారులు ఎతుక్కోవాల. ఆళ్ళొద్దన్న దారిలో పోకోవాలనుకోకూడదు. అలా గూకుంటే ఆళ్ళు మనని తొక్కేత్తారు. ఆ తొక్కిసలాటలో మనం నలిగి

పోయి పీసరొచ్చేత్తాం. అంత వొరకు ఎందుకు తెచ్చుకోవాల? — ఆళ్ళని మరో దారిలో సెడగొట్టే మార్గాలాలోసిచ్చాల. దానికి కావలసిన సరంజామా, వాతావరణం సుట్టించాల. అలాగ్గాని మనం సెయ్యకపోతే — నా సారా దేరల్సులన్నీ ఏటి గావాల ! సెప్పు మావ ! సెప్పు !!

మావా! నానింత వరకు సెప్పింది ఒక ఎత్తు. యిప్పుడు సెప్పబోయేదిమరొక ఎత్తు సానా జాగర్తగ యినుకో —

జనం ఎలా పోతే మనకెందుకు? మనం బాగుండే సాలనుకునే రకం మనది. అందుకోసం ఎలాంటి దిక్కుమాలిన యాపారాలైనా, పెసనాలైనా .... మనం ఏవీ పట్టించుకోము. కాని పెజల్ని, 'సైతన్య' వంతుల్ని సేసి, ఇప్పుడు దారుల నుంచి ఆళ్ళని తప్పించి, ఆళ్ళ బతుకులాళ్ళు పెళ్ళాం పిల్లలతో కుదురుగా, పొదుపుగా, నాయంగా, దర్మంగా బతికేటట్టు సెయ్యడానికి రోజుకు యిరవై నాలుగు గంటలు కూడా సాలకుండా ఎప్పుడూ జనంసుట్టూ తిరిగే పార్టీలోళ్ళు, సంగాలోళ్లు, ఇడి ఇడిగా పెద్దలు కొందరుండారు. ఆళ్ళు మనకు నిజమయిన పెతిపచ్చం. అలాంటోళ్ళ పీద ఓ కన్నేసుంచు. ఓ 'గన్' తీసుంచు. ఈళ్ళని మనం బతకనిత్తే - ఆళ్ళు మన్ని బతకనీయరు. జనాల్ని యసనపరుల్ని సేద్దామని మనం సూత్తాం — ఆళ్లు మన కడ్డుపడతుంటారు. కులాల్ని, మతాన్ని .... పూర్వ కాలం నుండీ పెజల్లో ఉన్న దిక్కుమాలిన బలయీనతల్నన్నిటినీ రెచ్చగొట్టి మనం కులుకుదాం అనుకుంటే - —యీళ్ళు మనకడ్డం తగిలి—"కులాల కుళ్లు, మతాల మత్తు మనకసలే వొద్దు".... అంటూ నినాదాలిత్తారు. మీటింగు లెడతారు.... జనాన్ని అనవసరంగా బాగుసేసేత్తారు. యిలాంటోళ్ళంతా 'ఏంటీ సోసల్ ఎలిమెంట్లు' అని మా బావొకసారి అన్నాడు.

మనం నిజమైన పెజాసోమ్యావోదులం కాబట్టి, పెజల్ని సెంటు పెరసెంటు ప్రేమించే వోళ్ళం కాబట్టి, ఆళ్ళు సొతంత్రంగా ఎంత సెందాలంగా బతికినా మనం ఏవీ పట్టించుకోం. తరతరలుగా 'తాగే' యీ జనం ఉన్నపళంగా సారాని మానేత్తే ఆళ్ల గుండె ఆగి సచ్చిపోరూ ! ఆళ్ళు ఆ రకంగా సచ్చిపోతారంటే నాకెంత బాధగా ఉందో ! పాపం! అంత మంది జనం ఒక్కసారి సచ్చిపోతే 'ఓటర్లిట్టు' ఎంత సిన్నదయిపోద్ది. దానివల్ల మనకెంత నట్టం ! మన దేశానికెంత నట్టం ! ఆ నట్టం ఎవ్వరూ తీర్సలేంది. మరిగందుసేత మావా — జనాన్ని యీ రకంగా బాగు సెయ్యాలని సూసేవోడు మనదుట్టిలో మహా నేరత్తుడు. ఇలాంటోళ్ళని మనం తగ్గిచ్చుకోవాల.

ఏ ఉద్దేమమయినా జనంలోకి వొచ్చేసింతరవాత మనం సెయ్యగలిగేదేంనేదు-రాకుండానే జాగర్తపడాల. అప్పుడే పెజాస్వామ్యం పది కాలాలపాటు మన సెప్పు సేతల్లో ఉంటాది. →

## అమ్మో ! సారాయి, దండం !

సాకి :- గుక్కెడు నీళ్ళులేని మారు మూల గ్రామాల్లోన
పాపాల పీపాల ! పత్యక్షమవుతావు తల్లో! ॥అమ్మో!॥

పల్లవి :- అమ్మో! సారాయి దండం !
మాతల్లో సారాయి దండం !
అమ్మమ్మ, మాయమ్మ, మాదెమ్మ, పెద్దమ్మ
ఇంకనన్నా నన్ను ఇడిసి పెట్టో తల్లీ !... ॥అమ్మో!॥

అన్నదమ్ముల మధ్య - ఆలుమగల మధ్య
చుట్ట పక్కాలల్లో - సావాసగాళ్ళలో
పెద్ద సదువుల్లోన - బుద్ధి జీవుల్లోన
గద్దెనెక్కిన పెద్ద - నాయకుల్లోన
వాల్లేంది. యీల్లేంది, ఆడమొగ తేడేంది
కిక్కు తల కెక్కించి - కైపులో ముంచావు... ॥అమ్మో!॥

వాడవాడల్లోన - ఊరు ముంగిట్లోన
మోత మోగించావు - రోత బుట్టించావు
ఆలుబిడ్డల్నేమొ - తాకట్టు పెట్టించి →

---

→ సివరిగా యింకొక్క యిసయం యినుకో—మన రాష్ట్రంలో జనం అందరికి ఎప్పుడూ కడుపు నిండా కూడుండ కూడదు. అందరికీ సేతి నిండా పనుండ కూడదు. ఏ సమస్యలకీ పరిష్కారం లబిచ్చకుండా ఎప్పుడూ యీ జనం యీతి బాదల్లో కొట్టుమిట్టాడి పోతుండాల. ఎందుకంటే - 'కడుపు నిండిన కోడి కప్పెక్కి కూసిందంట—యీ లెక్కని జనానికి కడుపు నిండితే రెచ్చిపోరారు. ఆళ్ళనెప్పుడూ ఓ నొక్కు నొక్కించాల. దారీ తెన్నూ నేక జనం గింజుకు పోతుండాల. ఐదేళ్ళకో తూరి మనం యీళ్ళకి 'కొత్త దారి' సూపిత్తన్నట్టుండాల. 'దాహం' తీరుత్తున్నట్టుండాల. యీ రకంగా మన పెజాస్వామ్య జీవచ్చవాన్ని ఈడ్చుకుపోయా ఉండాల. నాను సెప్పినవన్నీ యినుకున్నావు గందా! అయినా సువ్వసలే సెదసి సూపవి — నీకు తెలవందేటుంటాదిలే !

నా నుంటా మరి—

నీ మేనల్లుడు
రత్తుల కాంతయ్య

అప్పులోల్లందరని - ఉసిగొలిపి వదిలావు
ధర్మరాజను చేసి - జూదమాడించావు
హరిశ్చంద్రుని జేసి - యాలమేయించావు.... ॥అమ్మో!॥

ఇల్లంత గుల్లయితే — వొళ్ళంత సిల్లయితే
ఆలుబిడ్డలగతీ - అలో రామయ్యయితే
ఆయిన వాళ్ళందర్ని - ఆకలితో ముంచేసి
పండంటి కాపురాల - పాడె గట్టించావు... ॥అమ్మో!॥

సారా మాకొద్దంటూ - వూరూర లేస్తుంటె
లిక్కర్ల లీడర్ల - నక్కోని సూత్తుంటు
సర్కారు దొరవారు - ఏమేమిసేత్తమని
మెల్లగా జారిండు - నెల్లూరు జన్నయ్య
గద్దెక్కి కూసుని - యిజయ బాస్కరయ్య
సబ్ కమిటీ ఏత్తమని - సావు కబురు చెప్పిండు ॥అమ్మో!॥

సబ్బ్ కమిటేత్తిమి - తేల్చివేత్తమని
సల్లంగ సొల్లిండు - గుడిపూడి జంగయ్య
రొమ్మిరిసి అరిసిండు - యమ్మునరసింహయ్య
కన్నెర జేసిండు - కనుమూరి బాపయ్య
మీసాలు తిప్పిండు - కోణంగి రోశయ్య
లాఠీలు తిప్పమనే - తూటాల మైసయ్య
దొంగ సారాగాళ్ళ - అంతు చూస్తారంట.
అసలు దొంగలే యాల్లయితే - అంతు చూసెదెవడు... ॥అమ్మో॥

దొంగ మంత్రులాట - దగాకోర్లామాట
పసిగట్టి ఎరుపెక్కి - కసినంత దట్టించి
సారాసురులపైకి - నారి సారించారు
విజయ మార్గంలోన - ముందు కురుకుతుంద్రో
అక్కలకు అండగా — అన్నలందరూ గలసి
సారా సర్కారు — మెడలొంచి నడవాలి.

— దశరథ

## మనిషికి చావు లేదు

శ్వాస ఆగిపోయినంత మాత్రాన
మనిషి చచ్చిపోతాడా ?

శ్రమైక జీవన సౌందర్యాన్ని కోరుకోవడం
వెలుగులు విరజిమ్మడం కోసం సూర్యుడై మండడం
పదాల్ని విత్తనాలు చేసి విప్లవాలు పండించడం
అలవాటు చేసుకున్నవాడికి చావేమిటి ?

అహంతకో నియంతకో తప్ప
పిరికిపందకో స్వార్థ పరునికో తప్ప
హీన చరిత్రునుకో చరిత్రహీనుడికో తప్ప
మనిషికి చావుంటుందా ?

పోరాటాన్ని ఆకాంక్షించేవాడే మనిషి
పోరాటానికి ఆయుధమైనవాడే మనిషి
పోరాటంలో ప్రాణాల్ని పణంగా పెట్టేవాడే మనిషి
మనిషి చచ్చిపోవడమంటే త్యాగం చచ్చిపోవడమే !

ఈ నేల నేలంతా పోరాటాల నెత్తుటితో పదునెక్కడం త్యాగం
ఈ గాలి గాలంతా పోరాటాల పరిమళాలు పరుచుకోవడం త్యాగం -
పట్టెడు బువ్వనివ్వడం కోసం నాగేటి కర్రులా మొనదేరడం త్యాగం
ఆ త్యాగమే మనిషైనప్పుడు
ఆ మనిషి పోరాట వారసత్వానికి బాసటైనప్పుడు
మనిషికి చావు ముమ్మాటికీ లేదు.

—అల

[బూటకపు ఎన్‌కౌంటర్లలో అమరులైన వారి కోసం]

## సామ్రాజ్యవాద భూతా(త)ల స్వర్గం : 3

# వియత్నాం యుద్ధంలో అమెరికన్ సైన్యం కిరాతక చర్యలు-మేలే సంఘటన

—డా॥ కిరణ్మయి

దక్షిణ వియత్నాం ప్రజలు పాతిక సంవత్సరాలపాటు అవిశ్రాంతంగా అమెరికా సామ్రాజ్యవాద సైన్యాలతో పోరాడారు. తుదకు అమెరికా ముష్కర సైన్యాన్ని తరిమికొట్టారు. అమెరికా ఒక పేపర్ టైగర్ అని నిరూపించారు.

ఈ అమెరికన్ సైన్యం కనీస యుద్ధనీతిని పాటించకుండా ఎటువంటి దారుణాలు వియత్నాం ప్రజలపై చేసిందో తెలుసుకుంటే మన వళ్ళు గగుర్పాటు చెందుతుంది. ఇంత "నాగరిక ప్రజాస్వామ్య" దేశమని పోజులు కొట్టే అమెరికా దేశానికి చెందిన సైన్యం ఇంత నీచంగా ప్రవర్తిస్తుందా అన్న అనుమానం అమెరికా ప్రియులకు కల్గుతుంది. ఈనాటికీ ఇటువంటి స్వభావం అమెరికాలో కొనసాగుతూ వుండంటే వారికి నమ్మబుద్ధి కాదు.

ఇంతకూ 1968 మార్చి 16న వియత్నాంలో ఏ దారుణం జరిగిందో చూద్దాం. ఆ రోజులు దక్షిణ వియత్నాంలోని కేంద్ర తీర మైదాన ప్రాంతంలో ఉన్న మేలే(My lav) గ్రామంలో అమెరికా సైన్యపు 11వ కాల్బలం (Light Infantry) బ్రిగేడ్‌లోని ఛార్లీ కంపెనీ ఆ గ్రామంలోని ప్రజలను ఊచకోత కోసేసింది. యుద్ధం సామాన్య పౌరులపై చేసింది. ఈ కంపెనీలో సైనికులందరూ 16—22 మధ్య వయసు గలవారే. వారిలో సగంమంది తెల్లవారు - సగంమంది నల్లవారు. ఆ రోజు వారు 300 మంది పౌరులను విచక్షణా రహితంగా కాల్చిపేశారు.

ఆ గ్రామంలోని పిల్లలు ఛాకొలెట్ల కొరకు ఈ సైన్యంపైపు పరిగెత్తుకు వస్తుంటే, ఆటోమేటిక్ ఆయుధాలతో వారిని చంపేశారు. తల్లులనూ, పిల్లలనూ ఒకచోట చేర్చి వారిపై అత్యంత క్రూరంగా గ్రెనేడ్లను విసిరి చంపారు. యువతులపై లైంగిక దాడి చేశారు. వికృత లైంగిక చర్యలు జరిపారు. వారి జననాంగాలను బాయ్‌నెట్ కత్తితో చీల్చారు. మరి కొందరికి జననాంగాలలో బారెల్‌ను దొప్పించి పేల్చారు. వృద్ధుల, స్త్రీ పురుషుల చర్మం వలిచివేశారు. మరి కొందరికి కోసారు. తలలు నరికారు. నాలుకలు మెడలు నరికారు. చెవులు కోశారు. శరీర భాగాలు ముక్కలు ముక్కలుగా తరిగారు. ఆ పైశాచిక దారుణకాండ చేసిన అమెరికన్ రాక్షస సైన్యంపై యుద్ధనీతి ప్రకారం విచారణ జరగాల్సివుంది.

కాని కమాండర్ జనరల్ విలియం సి వెస్ట్‌మోర్‌లాండ్ ఈకంపెనీవారివీరోచిత చర్యలకు టెలిగ్రాం ద్వారా అభినందనలు తెలియచేశాడు! 'స్టార్స్ అండ్ స్ట్రిప్స్'→

# ఒక పోరాటమే చేద్దాం

మనం పాపమే చేసాం !
గోడ మీద ఉన్మాద నినదం
ఊపిరి పోసుకుని ఊరేగినప్పుడైనా
మనం జాగ్రత్త పడాల్సింది
మనం మహా పాపమే చేసాం !
ఉన్మాదసర్పాలు మనవిశ్వాసాల పాలుతాగి
కర్ఫ్యూళ్ళ పడగల్ని విప్పాయి
ఇపుడో ఆప్యాయపు చూపు లేదు
వేయి శిరచ్ఛేదాలు
ఇపుడో కరస్పర్శ లేదు
వేయి సజీవ దహనాలు
పేలిన ఉన్మాద పర్వత పొగమబ్బులు
దేశాన్ని కమ్మేసాయి

o o o

మనమంతా ఈ ధ్వంసాన్ని
ఒక కన్నీటి బొట్టుతో కొలుస్తున్నాం
మనం దిగ్బంధనంలో చిక్కుకు పోయి
పరాధీనులమై దేవుణ్ణో, దేవతనో
గౌరవంగా కొలుచు కున్నందుకు
నేడొక విషాదాన్ని దిగమింగుతున్నాం
మన బలహీనతపై స్వారీ చేసి
వాడో ఉన్మాద యుద్ధాన్ని ప్రకటించి
నందుకు
కవురు వాసనల్ని భరిస్తున్నాం

o o o

ఇప్పుడు దేవుడు
రాజకీయ నాయకుడై పోయాడు
బాలెట్ బాక్సయి పోయాడు
దేశం చెట్టు విషాదాలు పూసి
కన్నీళ్ళు రాలుస్తున్నందుకు
కళ్ళు తడవని వాడూ
మన విశ్వాసాల ప్రతినిధై పోయాడు !!
ఇంక మనకు దేవుడొద్దు, దూతలొద్దు
స్వాధీనులమే అవుదాం
ధ్యాన మొద్దు, ఉన్మాద యుద్ధ మొద్దు
మన మీద మనకు నమ్మకం కలిగి
ఒక పోరాటమే చేద్దాం

— ఎన్. ఎన్. వాను

→అనే అమెరికన్ వార్తా పత్రిక "అమెరికా సైన్యం కమ్యూనిస్టులను చుట్టి వేసింది-128 మందిని చంపింది" అని వార్త ప్రచురించింది.

ఈ కంపెనీ సైనికులు ఆ తర్వాత ఇచ్చిన వివరణ ఇలా వుంది: "ఎవరి నైనా షూట్ చేసి చంపడం ఎలా వుంటుందో చూడాలనుకున్నాం. మొదటి బులెట్ పేలిన తర్వాత అది తేలిక పనే అన్పించింది". మరికొందరైతే 'పిరాధిపిరులు'గా పేరు తెచ్చుకోవాలనుకున్నారు. అమెరికన్ వాడుక భాషలో 'పిరాధిపిరు'అంటే అర్థం స్త్రీలపై లైంగిక దాడి జరపడం, ఆ తర్వాత ఆ స్త్రీలను చంపివేయడం అన్న మాట. నాజీలు ఇదే పద్ధతిని అనుసరించారు !

18 నెలల తర్వాత 1969 సెప్టెంబర్ 5న ఈ కంపెనీ ఆఫీసర్ లెఫ్టినెంట్ విలియం కాలీపై 'ప్రాచ్యదేశాల మానవులను హత్యచేసిన' ఆరోపణలతో కేసు.→

కథనం :

## కిరేన్

మిత్ర

అది కరీంనగర్ జిల్లాలోని ఒక పల్లెటూరు. దాని పేరు ఏదైనా కావచ్చు. ఆ ఊర్లన్ని సాగునీళ్లు, తాగునీళ్లు దొరకక అల్లాడిపోతున్నాయి. కరువు కాటకాలతో తల్లడిల్లుతున్న ఆ పల్లెకు, ఈ మధ్యలో దిగిన బార్డర్ పోలీసుల బెడద కూడా తోడయింది. "నీళ్లో రామచంద్రా! (ఇక అన్నానికి వేరే చెప్పాలా)" .... అంటూ పొద్దనక, మాపనక ప్రజలు అష్ట కష్టాలు పడ్తూంటే, కరువులో వాంతి లాగా ఈ మిలిటరోల్ల తన్నులు, గుద్దులు తప్పడంలేదు. నీళ్ళ కోసం ప్రజలపేట, అన్నంకోసం పోలీసులపేట పెరిసి రాత్రి పగలు తెలియకుండానే రోజులు భారంగా గడుస్తున్నాయి.

చాలా రోజులుగా పసులు కూడా దొరకక నానాతిప్పలు పడ్తున్నవాళ్లకు ఆ ఊరు రంగరాయుని (రంగారావు) బాయి క్రేన్‌తో తవ్వేపని దొరికింది. పడుచు పిల్లగాండ్లు ఎనిమిది మంది కల్సి ఆ బాయి గుత్తకు పట్టుకున్నారు. అసలే ఎండలు మండి పోతున్నందున చుర్క—

---

→పెట్టారు. యుద్ధ నేరాల కింద విచారణ జరిగింది. కాని జైలుకు పంపలేదు.

పత్రికలు దీనిపై పెద్ద అభిరుచి చూపించలేదు. ఆ తర్వాత ఆరు వారాలకు వాషింగ్టన్ పాత్రికేయుడు సేమూర్ హెర్ష్ ఈ కేసు వివరాలు పరిశోధించి, కాలీని ఇంటర్వ్యూ వేసి, మొట్టమొదటి సమగ్ర నివేదిక తయారు చేశాడు. 'లైఫ్' పత్రికకు పంపితే వారు వేయలేదు. "లుక్" పత్రికకు పంపితే వారూ వేయలేదు. చాల గొప్ప స్థాయిలో నిర్వహింపబడేపత్రికలుగా పేరు ప్రఖ్యాతులు గడించిన ఈ పత్రికల అసలు స్వభావం బట్టబయలైంది. ఇక విసుగుపుట్టి అప్పుడే కొత్తగా ప్రారంభించిన **Dispatch News Service** అనే వార్తాసంస్థ ద్వారా ఆ వ్యాసాన్ని అమ్మాడు. 35 పత్రికల వారు దానిని నవంబర్ 13, 1969న ప్రచురించాయి. ఒక వారం తర్వాత 'క్లీవ్‌లాండ్ ప్లెయిన్ డీలర్' ఫోటోలు ప్రచురించింది. ప్రపంచవ్యాప్తంగా ఆందోళన పెల్లుబికింది. అమెరికన్ల కిరాతక చర్యలకు ...అమెరికన్ ప్రభుత్వ యంత్రాంగం ఇప్పటికే జరిగిన నష్టాన్ని పరిమితం చేయాలని ప్రయత్నించింది.

ప్రభుత్వ వర్గాలూ, సైన్యాధికారులూ, పత్రికలూ 'మేలే చిత్రవధలు' అనే పదం వాడవద్దనీ, 'మేలే సంఘటన' అని వాడమని బతిమిలాడాయి.

అమెరికా నైతికంగా ఎంతో ఉన్నతస్థానంలో వుంటుందని శ్లాఘించేవారు ఆ స్థాయి ఏమిటో ఒకసారి పునఃపరిశీలించుకోవాల్సి వుంటుంది. ★

పొద్దుకే లేసి, రాత్రి వండిన అన్నం సద్ది గట్టుకొని, తెల్లవారకముందే క్రేన్ పనికి బయలుదేరారు. ఊరు దాటుతున్న కూలోళ్లకుపిల్లిఅడ్డమొచ్చినట్లు, పోలీసుల వ్యాను ఎదురయ్యింది. 'మల్లేం కొంప మునుగుతుందో' అని కూలోళ్ల మనిషి మల్లయ్య అనుకుంటూ మెల్లగా అడుగు లేసుండగానే సడెన్ బ్రేకుతో పోలీస్ జీబు వాళ్లముందే ఆగింది. శవం చుట్టూ గద్దలు వాలినట్లు, ఇనుపబూట్ల టక, టక లలో తుపాకులు ఆడిస్తూ, పోలీసులు కూలోళ్లను చుట్టుముట్టారు. బారీకాయం తో ఉన్న గుబురు మీసాల అమీన్ సాబ్ దిగుతూనే ....

"లంజకొడుకుల్లారా! గింతమబ్బుల సద్దులు గట్టుకొని అన్నల దగ్గరకిపోతె ఎవ్వడ్ జూడడనుకున్నా(రా" అంటూ ఆ కూలోళ్లలో కొంత వయసుమీరిన మల్లయ్య గుండెకు తుపాకి ఎక్కి పెట్టిండు. "అరేయ్! మీరు ఎక్కడికి పోతున్నరో, మర్యాద కొద్ది జెప్పుండ్రి. లేకుంటె పిట్టల్ని గాల్చినట్టు గాల్చి ఈన్నే బొంద పెడ్త" అంటూ గద్దించాడు.

"సార్! ... నువ్వేదైనే జెప్తం .... మమ్ముల నేగి మనుకుండ్రి కిరెన్ దగ్గరికి పోతున్నం"—

మల్లయ్య మాట పూర్తికాకముందె లొందరగనే దిగొచ్చిండు. 'పిరికి లంజ కొడుకు!' అని మనసులో అనుకుని ఆఫీసర్ ఫుణా లెగుదేసిండు. కిరెన్ పేరు వినగానే కండ్లు మిటకరిచ్చినయి. ప్రమోషన్ చుక్కలుకండ్లల్ల మెరువగానే, పండ్లి గిలిచ్చిండు. మల్లయ్య మాట పూర్తిగాక ముందే "ఫోర్ నాట్ వన్, టూ నాట్ టు" అని కేకేస్తూనే, మిలిటిరోల్ల నుద్దేశించి "జెరా సునో! బయ్ ఆపన్ ఏక్ ఆద్మీకి పకడ్ నే కేలియే జా రాహా హై — వో కిరణ్ బహుత్ కథర్నాక్ సాలా హై! జరా హోషియార్ సే జానా పడ్తా," అంటూ హైరానా పడ్తున్నట్టు బోధించాడు. ఈ కాకిరి -బీకిరి భాష ఏదీ అర్థంగాక బయం, బయంగా నిలబడ్డ కూలోళ్ల వీపులకు తుపాకులానించి "ఛలో! లొల్లి పెట్టకుంట కిరన్ దగ్గరికి రొవ్వదియ్యండ్రి. లంజకొడుకుల్లారా! కింద, మీద జేత్తి రాంటె పాణాల్ దక్కయి" అమీన్ సాబే మళ్ళీ గద్దించాడు.

కిరెన్ దగ్గరికి ఎందుకు పోతమంటుండ్రో. ఏందో అర్థంకాక అక్కడి కెందుకని అడుగలేక "మాపేం బోతది సార్! రాండ్రి సూపిత్తం. అవ్వెద్దమో, నువ్వేదైనో మీకే తెలుస్తుంది," అంటూ కిరెన్ పైపు మల్లయ్య రొవ్వదీసిండు.

కిరెన్ దగ్గరపడ్తున్న కొద్ది కూలోళ్లకు మనసు తేలికపడ్తుంటె పోలీసులకు ఉద్వేగం పెరుగుతుంది. మనసులో దప్పులు కొడ్తున్న దాన్ని కప్పిపెడుతూ "ఇంకేడరా" ఆగబట్టలేక అమీన్ సాబేఅన్నాడు. "గదేందిసార్! గా కనబడేబాయి కాడనే"

మాట పూర్తి చేయక ముందే "మరి చెప్పరేమురా", గాబరా పడుతూ అమీన్ సాబ్ గుసగుసగానే నక్కి, నక్కి పోవాలని పోలీసులకు సూచన లిచ్చాడు.

"ఏంద్రో(. నక్కి నక్కి పోవాలని గీడు గుసగుసలు పెడ్తడు. పుండకొడుకు పాశి కల్లు గిట్లవైతె తాగి లేడుగదా...."

మల్లయ్య మనసులో అనుమానాలు ముసురుకుంటున్నాయి.

మల్లయ్య అనుమానాల్ని పటా పంచలు చేస్తూ, కూలోల్ల నడ్డం పెట్టుకుని పోలీసులు పిల్లుల్లా అడుగులేస్తూ బాయిని చుట్టుముట్టారు. ఇక ఆగబట్ట లేక అప్పటిదాక మనసులోనే ఈతతంగంపై ఉన్న అనుమానాలపై నోరువిప్పుతూ మల్లయ్య "సార్! గీ బాయి కాడ ఏం ...."

"ఆగు లంజకొడుకా! నోరుముయ్యి!" అంటూ అమీన్ సాబ్ గుసగుసగానె గుడ్లు తెరిసి నోరు మీద వేలేసిండు.

పోలీసులు బాయి దగ్గరిదాకా పోయినా ఎలాంటి అలికిడి లేదు. ఏ అలికిడి లేక పోవడంతో కాస్త ధైర్యంగానే అంతా వెతికినా కిరన్ కాదు గదా! కనీసం మనుషుల జాడకూడా కనిపించలేదు.

"ఏడిరా కిరణ్? అమీన్‌సాబ్ అగ్గయి మండుతున్నాడు.

"గిదేంది సార్! కిరేన్ గింత పెద్ద గున్న కనిపిత్తలేదా?" అంటూ బాయిలో మట్టితోడే క్రేన్‌ను చూపించారు, కూలీలు అమాయకంగా.

'లంజాకొడుకుల్లారా! ఇప్పటిదాకా గీ క్రేన్ గురించే చెప్పి మూడు కిలోమీటర్లు నడిపించి, మమ్ములను ఆగమాగం జేత్తార్రా?" ఆ ప్రాంత కార్యకర్త కిరణ్‌ను పట్టుకోవాలని అనుకున్న అమీన్ సాబ్ నీరుగారి పోయాడు.

క్రేన్‌కు వేలాడుతున్న ఖాళీ డబ్బా లాగా చేతులు వేలాడేసిన ఆఫీసర్ని చూసి కూలోల్ల కప్పుడర్థమైంది. 'అమ్మో ఈడు కిరనన్నను జూపిత్తమని ఆశపడ్డట్టున్నడు. వీని ఆగం పాడుగాను. మనల్ని మాట్లాడనిస్తె గద' అని ఎగసి వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకుంటూ "గీ కిరెన్ గాక మాకు వేరే ఏం తెల్వది సార్" అంటూ అందుకున్నరు.

నెత్తి గొట్టుకోవడం పోలీసుల వంతయింది. నెత్తి చెడిపోయినంక లాఠీ కూలోల్ల వీపులను పలకరించినా ఆపుకోలేని నవ్వు, ఆగిపోని పోరాటం పోలీసు లాఠీలను ఎగతాళి చేస్తూనే వుంది.

(కరీంనగర్ జిల్లాలో ఒక గ్రామంలో జరిగిన వాస్తవ ఘటనకు అక్షర రూపం ఇది) ★

## స్వీకారం

1. యుద్ధం జరుగుతూనే ఉంది—కవితా సంకలనం - ఎస్వీ - పేజీలు 46, వెల రు. 10-00 ప్రచురణ : హైదరాబాదు పాతనగర్ రచయితల సంఘం, ప్రతులకు — విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలలోనూ.

## సిటీ ఆఫ్ జాయ్

సాగర సంగమానికి ఉవ్విళ్ళూర్తున్న
గంగానదిలో పునీతమై
కాళీమాత కాళ్ళక్రింద నలుగుతూనే ఉందా మహానగరం
కనిపించని దూరాల్నుండి తెరటాలు తెరటాలుగా
రైళ్ళా లాంచీలా బస్సులా ట్రాములా టాక్సీల్లో
నిత్యం నిత్య నూతనంగా / ఆ ఒడ్డుకి ఇసుక మేటలా చేరే జనం—
అక్కడ పెనుతుపానుల్లో కొట్టుకుపోయి
ఆకాశ హర్మ్యాల వెనకన, రైలు పట్టాల ప్రక్కన
కుళ్ళు కాలువల గట్టున, బ్రిడ్జీల దిగువన
సజీవ కళేబరాలుగా మారి / బళ్ళు తోస్తూనో రిక్షాలు లాగుతూనో
బరువులు మోస్తూనో బండ పనులు చేస్తూనో
ఒళ్ళమ్ముకునో ఒంట్లో అవయవాలమ్ముకునో
రౌడీలుగానో దాదాలుగానో
ఏవైతేనేం కేవలం కడుపుకోసం
వాళ్ళ పాట్లేవో పడ్తూ వాళ్ళ మానాన వాళ్ళేలాగో బతుకుతారు
నిత్యావసర వస్తువుల్లా వారిని వాడిన మహానగరం
వారి అవసరాలకు మాత్రం ఆమడంత దూరం
వారి బాగోగులు అనవసరం - వారి విషయాలు అసహ్యం
వారి కోసం యోచించినా
కథల్లో ఇరికించినా కనికరం ఒలికించినా ప్రపంచానికి చూపించినా
మానభంగం జరిగినంత కలవరం భయం
మహానగరం పటాటోపం నలుగురికీ తెలిసిపోతుందేమోనని
మహానగరం సమస్తం అదే జాతి క్రింద జమ కడ్తారని
మహానగరంలో వస్తువులనుకున్న వాళ్ళు ఆయుధాలుగా మార్తారేమోనని
మహానగరానికి లేనిపోని కళంకమేదో తెచ్చిపెడ్తారని
కాదు కూడదని ఒప్పించటానికి ప్రయత్నించావా!
కళ్ళెర్రజేస్తూ కసిరి కసిరి తరిమి తరిమి కొడుతుంది
నగరం సర్వత్రా సంతోషం అనుకోమని శాసిస్తుంది.
(కలకత్తా మహానగరంలో 'City of Joy' చలన చిత్రం విషయంలో రేపిన దుమారానికి ప్రతిస్పందన)

— వై. ముకుంద రామారావు

వ్యంగ్యం :

# సారాస్వామ్యం

—క్రాంతి కిరణ్

త్రిలింగ రాజ్యం అల్లకల్లోలంగా ఉంది.

ప్రజల్ని మత్తులో ముంచేసే సారాని నిషేదించాలంటూ రాజ్యం నలుమూలల నుండీ నారీలోకం నినదిస్తోంది. పెద్ద ఎత్తున తిరుగుబాటు చేస్తోంది.

మంది సొమ్మును అమెరికన్ పందిలా దిగమింగే త్రిలింగ రాజ్యాధిపతి ధనార్జునునికి ఈ తిరుగుబాటు పెద్ద తలనొప్పిగా తయారైంది.

ప్రజల్లో చెలరేగిన ఈ తిరుగుబాటును ఆసరాగా చేసుకొని దాయాదులు కొందరు హస్తినాపుర చక్రవర్తి వరాహుడితో రహస్య మంతనాలు ప్రారంభించి ధనార్జునుడ్ని గద్దె దించడానికి తీవ్రంగా ప్రయత్నించసాగారు.

వేగులు ద్వారా ఈ విషయాన్ని తెలుసుకొన్న ధనార్జునుడు, మంత్రిమండలిని తన అంతరంగిక మందిరానికి రప్పించుకొని, ఎడతెరపిలేని చర్చలు సాగించాడు. ఆ తర్వాత రాజ్యంలో చెలరేగిన దాయాదుల అసమ్మతినీ, నారీలోక తిరుగుబాటునూ ఒక్కసారిగా అణచడానికి అవసరమైన మార్గాలను అన్వేషించేందుకు సభను ఏర్పాటు చేశారు.

సభా భవనం క్రిక్కిరిసిపోయి ఉంది. ధనార్జునుడు సింహాసనం మీదుండి సభనంతా ఓమారు కలియ జూసికొని, రీవిగా లేచి నిలబడి రాజదండం చేబూని, గొంతు సవరించి ఇలా సెలవిచ్చారు:

"సభాసదులారా ! త్రిలింగ రాజ్యంలో నేడు చెలరేగుతున్న అల్లర్లు మీకు తెలియనివి కావు. కొన్ని దేశ విద్రోహశక్తులు సుభిక్షంగా వర్ధిల్లుతున్న మన రాజ్యంలో అరాచకం సృష్టించడం కోసం, కుంటి సాకులతో ప్రజల్ని మభ్యపెట్టి అనవసరంగా తిరుగుబాట్లు లేవదీస్తున్నారు. ప్రతి చిల్లర మల్లర విషయాలకీ ఈవిధంగా అల్లర్లు చెలరేగితే రాజ్యపాలన ఎలా కొనసాగుతుంది? ప్రజలు సుఖశాంతులతో ఎలా మనగలుగుతారు ? ఈ తిరుగుబాట్లను ఇలా కొనసాగనిస్తే అసలే కుంటుపడి ఉన్న మన ఆర్థిక పరిస్థితి మరింత దిగజారి, రాజ్యంలో క్షామం ఏర్పడుతుంది. ప్రజలు మృత్యువాత పడవలసి వస్తుంది. అందువల్ల ఈ విషమ పరిస్థితుల్ని అధిగమించి, దేశాన్ని ఆర్థికంగా అభివృద్ధి పథంలో పురోగామిగా తీర్చిదిద్దే యత్నంలో భాగంగా, దేశంలో చెలరేగే ఎలాంటి తిరుగుబాటునైనా నిర్దాక్షిణ్యంగా అణచడానికీ, అవసరమైతే ఆ తిరుగుబాటుదారుల్ని—స్త్రీ పురుష బాల వృద్ధులనే విచక్షణ పాటించకుండా ఊచకోత కోయమని మన రక్షకభటులను ఆజ్ఞాపిస్తున్నాము...."

సభలో ఒక్కసారిగా నిశ్శబ్దం ఆవరించింది.

ధనార్జునుడు సభను ఆసాంతం అటునుండి ఇటు తీక్షణదృక్కులతో పరికించి వేగంగా వ్రేలితో ముక్కుపుటాలను కలియ దిప్పాడు,

"అంతేకాదు. రాజ్యాన్ని ఆర్థికంగా పటిష్టపరచడానికి మేం కొన్ని నిర్ణయాలు కూడా తీసుకొన్నాం. సారాను నిషేధించడం వీలు లేదని తీర్మానించుకున్నాము. మన వార్షికాదాయంలో అత్యధిక శాతం సురావిక్రయం వల్లనే సమకూడుతోంది. ఆ డబ్బుతోనే ప్రభుత్వం ప్రజలకు అవసరమైన నిత్యావసర వస్తువులను అతి తక్కువ ధరలకు అందించ గలుగుతోంది. నేడు మనం ఈ సురా అమ్మకాలను నిషేధిస్తే అట్టడుగు వర్గాల ప్రజానీకం నిత్యావసర వస్తువులు కొనలేక తిండికి అలమటించి పోతారు. కనుక పేద ప్రజల సముద్ధరణ కోసం 'సురా' అనే వారుణ వాహిని పథకాన్ని సగర్వంగా కొనసాగిస్తామని సభా ముఖంగా తెలియ జేస్తున్నాము. ఈ ఆబ్కారీశాఖకు సహోదరుడు- అసమ్మతి వర్గ నాయకుడు రాజశేఖరుణ్ని అధిపతిగా నియమిస్తున్నాము.

"అంతేకాదు. మధ్యం తర్వాత మనరాజ్యంలో సాగుతోన్న చీకటి వ్యాపారాలన్నింటినీ జాతీయం చేస్తున్నామని తెలియచేస్తున్నాము."

ప్రభువర్గం నుండి, వ్యాపార వర్గం నుండి, అసమ్మతి దాయాదివర్గం నుండి సయితం పెద్ద పెట్టున హర్షధ్వానాలు చెలరేగాయి.

"వేశ్యావృత్తిని జాతీయంచేసి, ఆశాఖను సమర్థవంతంగా నిర్వహించుటకుగాను అసమ్మతి వర్గనాయకురాలు శ్రీమతి రాజనందినిని అమాత్యురాలినిగా నియమిస్తున్నాము. ఈ వృత్తిని జాతీయం చేయుటవల్ల రాజ్య ఖజానాకు మిక్కుటముగా ధనంచేకూరడమే గాకుండా కొంతమందికి ఉద్యోగావకాశములు కల్పించడం జరుగుతుంది. ఆ ధనాన్ని ప్రజాహిత కార్యక్రమాలకు వినియోగించ గలుగుతాము. !

"సభాసదులారా ! ఇలాగే ప్రభుత్వ వేశ్యాగృహాలతోపాటు, ప్రభుత్వ జూద గృహాలనూ, ప్రభుత్వ చోర సంస్థలనూ, ప్రభుత్వ లాటరీలనూ, ప్రభుత్వ మానభంగ సంస్థలనూ, ప్రభుత్వ హంతక నిలయాలనూ స్థాపించాలని నిర్ణయించాం.

"జూదమాడదల్చినవారు ప్రభుత్వ జూదగృహాలలోనే ఆడవలెను. ఐతే అందుకు ముందుగా నిర్ణీత పన్ను చెల్లించవలెను.

"దేశంపైపడి దొంగలు యథేచ్ఛగా దోచుకో వచ్చును. ఐతే అందుకు 40 శాతం సుంకంగా ప్రభుత్వానికి చెల్లించ వలెను.

"మానభంగములు చేయదలసినవారు విధిగా ప్రభుత్వమునకు వెయ్యినూటపదహార్ల చొప్పున ఒక్కొక్క మానభంగమునకు ప్రభుత్వానికి సుంకంగా చెల్లించవలెను.

(తరువాయి 27 వ పేజీ)

# చూస్తూండు....!

మొక్కుబడి ప్రశ్నల వొంకర నవ్వెందుకు
కప్పుకున్న గుండె పొరల కింది దిగుల్ని వెలికి చూడు
అవయవ కోతలూ
ఏడ్పుల వెనుకటి నెత్తుటి మరకల విషాదమూ
అర్ధాంతరంగా ముగిసిన భవిష్యత్తులుంటాయి—
తెప్పరిల్లని ఊబిలోంచి
కాలక్షేప కబుర్లేం ఉంటాయి
ఈ సంతాప శిబిరాన
నిజం చెప్పాలంటే దాచుకున్న రహస్యాలేవీ లేవ్
ఆరాటమే తప్ప
చుట్టూ ఆరిన దీపాలే
నలుపూ తెలుపు వరల్లో
గాయాలై కళ్ళు క్షోభించాయి
కుళ్ళిన అవశేషాల వాసన నుంచి
తొడుగులిప్పిన బారికేడ్లకు బందీలం
కాలక్షేప కబుర్లేం ఉంటాయి
పొట్ట చేతబట్టి పుట్ట లేరేసి
గుక్కెడు గంజి తప్ప మరే వరాలడిగాం ?
బతుకుల్ని బుట్ట దాఖలా చేశారు
నిజానికి ప్రపంచాన్ని చూస్తున్నామన్న మాపే
మా ప్రపంచాలు మాసిపోయాయంటే నవ్వుతారే ?
మా కొంపలు మీ కోపానికి దగ్ధమైయ్యాయి
మా బతుకులు మీ మోహాలకి నవ్వుతాలైనాయి
మాకన్న పేగులు మీజాతి దాస్యానికి ఉడికినాయి
నదులన్నీ గుండెల్లోంచి ప్రవహిస్తున్నపుడు
మొక్కుబడి పరామర్శలు మాత్రం ఎందుకు ?
మీరు కలుషితం చేసిన మా నగ్నదేహాల రోదనలు
చివరికి ఇలానే...........
కాలువలై పారుతాయో
అడివై మండుతాయో
చూస్తూ చూస్తుండు.

—ఇక్బాల్ చంద్

"—అందుకని కేసు ఒప్పేసుకో !"

.... "మేస్ట్రీటు బాబు నిన్ను బొక్కలతోసేమంటాడు! అంతే! నా సామిరంగా, నువ్వు అల్లుడు వేసం ఏస్తావు. రెండు పూటలా తిండెడతారు. తిని తొంగోడ(వే నీ పని ! నువ్వేం అరిశ్చెంద్రుడి వేటిరా ? అబద్దం ఆడక పోనానికి."

"అదుగో ! మల్లా అదే మాట! నానింతా నీకు సెప్పిందేటి ? నువ్వాలకించిందేటి ? నా మాట నువ్వినుకోలా ?— నీ మాట నేనినుకోవాలా ?"

"ఒరే ! మరి టయిము నేదు.... ఆ బంగారం గొలుసు మరొకడిదీ మరొకడిదీ కాదు. మాకు రంకు మొగుడు మినిష్టరు గారిది. ఆడిదీకాదు..ఆడికి రంకుమొగుడు లాటి ఆడి పెల్లాన్ని .. దొరక్క దొరక్క ఆడికి పదవి దొరికిందేమో - కోతికి కొబ్బరి కాయ దొరికినట్టు - అయ్యేల నుంచే పేరంటం ! నొల్లుకోడం - అది కూడా అలాగా ఇలాగా కాదు రెండు సేతలా ఆడు - రెండు సేతలో ఇదీ - ఒకలికొకలు పందేలేసుకుని ఆబగా నొల్లేసు కుంటన్రు. అల్ల టయిము ఇది. ఎవడు మాత్తరం ఏటి సేత్తాడు ! .... ఆ జాగా అట్టాంటిది. చవం ఆలిస్యవయితే ఎనకబడి పోతాడు. అదలా ఒగ్గి! ఇయ్యాల రేపు ఎవుడి పెబుత్వం ఎన్నాల్లుంటుందో ఎవుడి కెరుక. మా సిన్నప్పుడు ఖచ్చితంగాఅయిదేల్లుండేవాడు మంతిరి. ఇప్పుడులు కుర్రాల్ల పాఠం పుస్తకాల్లో కూడా ధైర్యంగా ఎవడూనికి ఫలానా మంతిరి ఫలానా వాడు అని. ఈ లోగా ఇంకోడు మారి పోతన్నాడు.... ఇహ కుర్ర నా కొడుకు లకి సదుపేటొచ్చేది !— నానేదో సాద త్తంగా పోగుతున్నాను. నీకు నీతులు చెప్పనానికి - నాకున్న నీ చేటని — అందుకని డ్యూటీ సెయ్యాల — ఆ డ్యూటీ సేసుకోడానికి నానా సంకలు నాకాలి— తప్పదు మరి..."

"ఆ(! ఏటి సెప్తన్నా— ఆ గొలుసు ఆడి పెల్లాన్ది— పోనాదట.. ఆడిపెల్లాం గొలుసు ఎదికి పెట్టనానికి మా(వున్నాము. ఆ "శ ర భ" — "శ ర భ" ంటూ మా మీద ఇరుచుకు పడింది. రేపు సాయింతరం లోపల. మా(వు ఎతికియ్యాలంట. లేకపోతే మా ఉద్దోగాలకి ఇంతే సంగతులు. గొలుసు పోనాదే అనుకో ! దానికేటి తక్కువ ? ఒకటి పోతే పదొత్తాయి. — ఆ బుర్ర నేదే.. అదీ కావాలి! మరో పదీ కావాల !—తే తెమ్మని కూకుంది. అదేపే కష్టార్జితం కాదే! అయ్య బాబోకానీ పరకా కూడ బెట్టి సంపాయించదనుకోడానికి...నిజంగా గొలుసు పోనాదో! మమ్మల్నే సూపు సూపియ్యాలనో - దానెత్తేటో ఎరికవటం నేదు. 'పాపం' 'పున్నెం' - ఆ భగమంతుడికే తెలియాల".

"నిజంగా గొలుసు ఇంకెవడిదో" సన్నాసి నా కొడుకుది పోనాదే అనుకో- ఆడు రిపోర్టు ఇచ్చినాడే అనుకో! - ఆ దొంగ నా కొడుకెవడో మాకు ఛనాల్లో తెలిసి పోద్ది. కష్టపడి దొంగతనం సేసి

నందుకు అడికి— కేసు లేకుండా మాపు సెయ్యడానికి మాకూ పంపరాల్తోనే సరి పోద్ది - ఇహ ఆ సన్నాసి నా కొడుకం టావా ? —ఇయ్యాల కాదు రేపు.. రేపు కాదు ఎల్లుండి— 'ఏదీ సిగరెట్టు పట్రా- మందు కొట్టించు. కోడి పలావెట్టించూ, అని అడినో పది రోజులు తిప్పుతే — అడి యడ్రసు మరి కనబడదు. అడిని మన్యాలు పట్టించేస్తాం "గొలుసు పోతే పోనాది. కేసూ వొద్దు గీసూ వద్దు. నన్నొగ్గేయండి అంటూ ఆడే కాల్లబేరంకి వొస్తాడు."

"అన్నట్టు ఏటన్నానూ! పాపం - పున్నెం - ఆ భగమంతుడికే ఎరికని కదూ!' ఆ సంగతే సెబతన్నా"

"శివుడాగ్న లేందే సీమైనా కుట్టదు..' అంటారు. నువ్వాలకించే పుంటావు — అంటే ఏటన్నమాటా ? నువ్వు సవ్వా లన్నా సవ్వలేవు— బతకాలా అంటే బతకనేవు—అంతే, నీ ఇస్టం పనికిరాదు అంతా ఆడి ఇష్టం! — శివుడి కిష్టం లేదనుకో! కేసునువ్వొప్పుకోవు - నిన్నొప్పించాలని మా తంటాలేపో మేం పడతాం. కుక్క సావుసస్తావు. ఇందలో

→

( 23 వ పేజీ తరువాయి )

"హత్యలు చేయువారు ముందుగా హంతకనిలయాలలో కొంత సొమ్ము చెల్లించి, తాము ఎవరిని హత్యచేయదలచారో తెలియచేసి కార్యక్రమం జయ ప్రదంగా ముగిసిన తర్వాత ఆ నిలయం వారు నిర్ణయించిన మూల్యాన్ని చెల్లించ వలెను. ఈ విషయములన్నీ అతి గోప్యంగా ఉంచబడగలవు.

"ఇందు మొదటి రెండు శాఖలనూ అసమ్మతివర్గ దాయాది శ్రీభాస్కరునికి, చివరి రెండు శాఖలనూ శ్రీసుధీరునికి కేటాయిస్తున్నాము.

"సభ్యమహాజనులారా! ఈ క్రొత్తరాజ్యాంగము మా 'వంశ పిత' జన్మదిన మైన అక్టోబరు రెండు నుండి అమలులోనికి వస్తుందనీ, యావత్ప్రజానీకమూ ఈ రాజ్యాంగానికి బద్ధులై ఉండగలరని, ఆర్థికరంగంలో మనరాజ్యం మరింతగా పురో గమించాలని ఆశిస్తున్నాం. రాజ్య సమున్నతికోసం మా ప్రజానీకం మా ఆజ్ఞల్ని శిరసావహించవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాము—" అని రాజదండం పైకి ఎత్తిపట్టి సభను ఓ మారు కలియజూసి, సింహాసనాసీనుడై, దీర్ఘాలోచనలోపడి వ్రేళ్ళతో ముక్కుపుటాల్ని కలియబెట్టుకున్నారు ధనార్జునుడు. ★

మార్పు సేసిస్తేనీ సేదు. మావందరం నిశిత్త నాస్తర్లం— ఎంగోతంటే — మంతిరిగారి పెళ్లాం గొలుసు పోటం. అది పోలీసోళ్ల కి పెటం — సుప్పు దొంగవంటూ కాపోలోనా మా పల్లలో పడటం, నిన్ను బొక్కల తోయడం— ఇయ్యన్ని ఏటి ? — సుప్పు ఎంపు కి రు పిక్క సోవాల లూ సేసులో ఇప్పటికుంటా ? అది అగ్గి అయి పోయిందన్నకోకు. అంతా ఆడి లీల.... అలాగని నేను సెప్పేసు. ఎంచాతంటే ఆడి అగ్గి అవలేదనుకో-సుప్పు దొంగ తనం సేయకపోయినా సేసు ఒప్పేసు కుంటావు. హాయిగా బొక్కలో వుంటావు. నీ ఖరమ కాలి కేసు ఒప్పుకోపోతే లాకప్‌లో సత్తావు.”

”మరమం లేకుండా ఎన్ని సెప్పానో ఎన్ని యిదాలుగా బోదపరిచానో, మరింక నాను సెప్పేదేటీలేదు. నీకో గంట టయిము ఇచ్చినా! సల్లక కూకొని దీర్గంగా ఆలోసించు. సత్తావా ? కేసొప్పు కుంటావా ?”

“అంతే ! దొంగనాకొడుకు ఇన్ని సెప్పినా యినుకోలేదు. మరి మావేటి సెయ్యాల ? ఆడికి భూమ్మీద నూకలు సెల్లి పోనాయి. లాకప్‌లో కుక్కచావు సచ్చిండు.”

“లాకప్‌లో నీ మొగుడుని సుంపుని సచ్చాడే ! డాక్టరు బాబు సర్టిఫికేట్టు చూసుకో కావలిస్తే. మావేటి అబద్దం ఆడిలేదు. ఇదిగో ఈ రెండొందలూ అట్టుగ్గి ఆడిని మూడిసీ. మన సేతల ఏటినేదు. అంతా ఆడి లీల”ని ఆడి పెళ్లానిక్కి నయానా భయానా సెపితే- ఆ దొంగనంపేటి సేసింది ? మేక పిల్ల కొండరో ‘ ’ కాడితే ఏటవుద్ది ? అదే అయింది. మా పరువు తీసేనానికి ఆడి శవాన్ని రోడ్డుమీదేసి ఆ పార్టీవాల్లనీ, యీపార్టీ వోల్లనీ గిల్లింది. అల్లు సెప్ప పోనారు.... పాపం దొంగనంజ, .... మొగుడు పోనడని ఇంకా గుండెల నిండా ఏడవ సేదు. ఎన్కౌంటరులో సచ్చింది. ఆల్లిద్దరూ సెయ్యా సెయ్యి కలుపుకుని సొరగానికే ఎల్లారో నరకా నికే ఎల్లిర్రో.. అదంతా ఆల్లు సేసు కున్న ఖరమ.”

..... గొలుసు సంగతా !ఆ దెప్పుడో దొరికిపోనాదని, తలగడ గలేబులో వుం దని సావు కవురు సల్లగా సెప్పేడు మంతిరిగారు.”

“ఏటో... డ్యూటీ...అంటే—డ్యూటీ.

## ఉత్తరాలు :

కొత్తపల్లి రవిబాబు గారి “సంక్షుభిత సోమాలియా” నేటి సోమాలియా పరిస్థితి ఎంత దారుణంగా వుందో మా కళ్ళ ముందు పెట్టింది.

బొడ్డపాడు — గంగాధర్

# మనిషిని ప్రేమిస్తాను

వాడు చదువుకొని వాడు కాకపోవచ్చు
    చెమటోడ్చి కష్టపడుతున్నాడు కదూ
వాడు కవిత్వం రాయలేక పోవచ్చు
    కలలు కంటూ [illegible] / సరుకులు సృష్టిస్తున్నాడు కదూ
వాడు బడా వ్యాపార వేత్త కాకపోవచ్చు
    బస్తాల బరువు మోస్తున్నాడు కదూ
వాడు నాగరికుడు కాకపోవచ్చు
    నగరం మురికి శుభ్రపరుస్తున్నాడు కదూ
ఏది ఏమయినా వాడు మౌలికంగా మనిషి
మరి — వాడిని ప్రేమించకుండా ఎలావుంటాను ?
ఆమె మగసర్పపు విషపు కాటుకు బలయి
    'పతిత'గా ముద్రపడిన మానవి
ఆమె తన రక్తం తనే తాగి బ్రతుకుతున్న వ్యభిచారిణి
    ఎవర్నీ మోసం చెయ్యలేని నిజాయితీ పరురాలు
ఆమె మందలోంచి తప్పిపోయిన మేక పిల్ల
    గుంపులోంచి జారి పడిన కోడిపిల్ల / ఆమె ప్రాణం పొయ్యడం తప్ప
    తియ్యడం ఎరగని అబల/మరి - ఆమె కోసం
నా ప్రాణం సమర్పించకుండా ఎలా వుంటుంది ?
వాడు ఉద్యోగాలు చేసి ఊళ్ళేలనక్కర్లేదు
    ప్రజా ఉద్యమాల్లో తల మునిగి వున్నాడు కాదూ
వాడు ప్రాణాలు తీసే 'రక్షక' భటుడు కాదు.
ప్రాణాలు ఇచ్చే ప్రజా వీరుడు కదూ
    వాడు న్యాయానికి నల్లకోటు తొడిగే నయవంచకుడు కాదు
అన్యాయాన్నెదిరించే అసామాన్యుడు కదూ
వాడు నల్ల డబ్బు గడించే తెల్ల వాడు కాదు.
ఎల్లరికీ మేలుచేసే నల్ల వాడు కదూ / అన్నిట్నీమించి
వాడు ప్రాథమికంగా ఈ దేశ పౌరుడు కదూ
వాడిని ప్రేమించకుండా ఎలా వుండగలను ?
ఎంత గొప్ప ధనం, సిరి సంపదా వున్నా
ప్రాణమున్న మనిషితో సరితూగ గలవా అవన్నీ
మరి - ఆ మనిషికి ప్రాణం పెట్టకుండా ఎలా వుండ గలను ?

—డా॥ మానేపల్లి

# సారా వద్దు బాబోయ్

వద్దు వద్దు సారా వద్దు బాబో
మాకు త్రాగునీరు కావాలి బాబో

గవర్నమెంటు వాళ్ళంత
గరిబోల్ల ముంచుటకు
సారా దుకాండ్లు పెట్టి
తందనాలు ఆడుమని
సంసారం ముంచుకొని
తన్నుకొని సావమనిరి.... ॥వద్దు॥

సొమ్ములన్ని అమ్ముకొని
సారా బ్రాంది, బారు కీయి
ఒళ్ళు తెలువకుండ త్రాగి
ముండ్ల కంచెలొబడ్తివి
కండ్లు మూసి కాటికైతె
పిల్లలకె కరువైతివి. ॥వద్దు॥

మద్యపాన మైకంలొ
నా వాల్లని తెలియక
మంచి చెడ్డ చూడ కుంట
మంది లంత తిట్టుడాయె
ఇల్లు ఒల్లు గుల్లు చేసి
ఇంటోళ్ళను కొట్టుడాయె ॥వద్దు॥

ఈడేరి ఇంట్లో ఉన్న
బిడ్డ పెండ్లి చేస్త మని
కష్టపడి ఇంతొ అంతొ
ఎనుకేసుకున్న ముల్లె
సారా కొట్టుకే పాయె
తల్లి పిల్ల లేమయిరో ॥వద్దు॥

సారా గుత్త దారుల
మేడలెన్నొ పెరిగినాయి
మన కష్టం దోచు కోని
దొంగ లంత దొరలైరి
తాగుడుకు ఉన్నదమ్మి
బజార్లొ బ్రతుకుడాయె (తరువాయి 33 పేజీ) ॥వద్దు॥ →

# నేల తడవని వాన




—సమీక్షకులు: ఛాయరాజ్

దోపిడీ పీడనలను విదల్చుకొనేందుకు ఈ నేలా, ఈ నేలనదుపుకొనివున్న జీవితమూ పెనుగులాడుతున్నాయి. సంఘర్షణ, రాపిడులతో వేడెక్కుతోంది సమాజం. మానవశ్రమ ఫలితంగా నిర్మాణమైన నాగరికత, సహజవాతావరణాలు కలుషితం చేయబడ్డాయి. జీవితాన్ని పెనవేసుకొనాల్సివున్న జీవన సౌందర్యం అంతంతదూరం లోనే యిగిరిపోతోంది. నేల తడవని వాన నిప్పులుగా ఘనీభవించి కురవకమానదు. ప్రజావ్యతిరేక నిర్మాణం తగలబడి, ప్రజా జీవన విధానం అంతకంతకూ పదునెక్కి తీరుతుంది. ఏలేశ్వర నాగభూషణాచార్య "నేల తడవని వాన" కవిత ఈ భావాన్ని స్ఫురింపచేసిందంటే కవితా ప్రయోజనం సాధింపబడినట్టే. ఏలేశ్వర కవితను యింతకు పూర్వమే 'ప్రజాసాహితి' ప్రచురించి ప్రజాకవిగా ఎదుగుతున్న నాగభూష ణాచార్యను గుర్తుపట్టింది.

ఈ నేలమీది జీవితాలు ఎలా తగులబడిపోతున్నాయో కవితారీతిలో బలంగా చెప్పజూచిన కవికి పోరాట మనస్తత్వం వుంది. పరిష్కార మార్గం కూడా తెలుసు. "ఆకలే ఆయుధాన్ని ధరింపజేస్తుంది", "రక్త పతాకాన్ని ఎగరవేస్తాను", "జీవితం బరువెక్కినప్పుడు భావాల ఖడ్గాలను ఆలోచన సానమీద రాయండి" "ఛిద్రిల్లిన భీకర శబ్దంలోనే మృత్యుంజయుడు జనించాలని", "తొలి సంగ్రామానికి నేపథ్యం ఆల పిస్తాను", "ఊరు....పరుగెత్తే కత్తై కాసిస్తుంది" "చెలరేగిన జీవితపు భవిష్యద్దర్శ నానికి చూర్పుబాటను నిర్మించుకోవటమే" లాంటి భావాలన్నీ ప్రజలను పట్టి పీడి స్తున్న పెద్ద సమస్యకు పరిష్కారాలను సూచించేవే.

ఏలేశ్వర పల్లె జీవితాన్ని ప్రేమిస్తాడు. పల్లెలోని ఆర్ద్రతకు పట్టణంలోని జ్వరానికి తేడా - మవులికమైన మనిషి జీవితంలోంచే గమనిస్తాడు. ప్రేమ నివ్వడాని కైనా, పోరాటాన్ని పెంచడానికైనా పల్లె ప్రమాణం కాబట్టీ, కవి పల్లెకే అంకితమై నట్టు కవిత చదువుతున్నప్పుడు అర్థమవుతుంది. తెలంగాణా యాస, మాండలికాలు భావవ్యక్తీకరణలో సజీవంగా పొందుపరచడంవల్ల ఆ ప్రాంత సంస్కృతిపై కవికి గల అనురాగం అపారమైందని తెలుస్తుంది. తెలంగాణా ప్రాంతంలో ప్రజల మనో భావాలు ఈ కవిత ద్వారా కొంతవరకు తెలుసుకోవడానికి అవకాశం వుంది.
కవిత్వంలో కొన్ని మచ్చుతునకలు—

నగరంలో "మద్యం సేవించిన కార్మికుని ఆక్రందనలతో
ఆ పసిపాపల పాల బుగ్గలమీంచి పారిపోయాయి"
"జీవన పోరాటంలో దిగంబరిస్తున్న దేహ
తురాయి పూలరేకుల ముక్కలను కప్పుకుంటాను"
"ఖర్మజలాల మర్మాలను గుర్తించలేని నేర్పరి"
"భూమి బీటల్లా పగిలిపోయిన (పసిపాప) నిక్కరు"
"పూల కొలిమిపై ఎవరి సంతకాలు ఎర్రగా"
"మూగవేదనలో మువ్వ జనించింది.

వేకువ పాదాలపైనే మువ్వలల్లుకొన్నాయి"
"పాత రాతియుగం మనిషి ఆకుల్ని ధరించినట్టు
రూపాయి రేకుల్ని ధరించాలని
పాకుడుబండపైకి మొసలి పాకినట్టు పాకుతున్నాం"
"దివిటీలు ఆయుధ సామాగ్రే"
"డప్పుల ధ్వనిలోనే అడవులన్నీ ఆలింగన చేసుకుంటాయి"
గాలి "........బిక్కుపల్చని భుజాలపైన
భారమైన వార్తాపత్రికల్ని మోసుకొచ్చి
సముద్రాన్ని గుమ్మరించినట్లు కిటికీ గుండా
వార్తల్ని నా ముఖంపై గుమ్మరించిన జ్ఞాపకం"

ఏలేశ్వర ఆధునిక కవితను అధ్యయనం చేసినపుడు వెలుపలగా ఉండలేక పోయారేమో. కవి శైలిని బట్టి కొందరి కవుల ప్రభావానికి లోనైనట్టు కనిపిస్తుంది. సొంతగొంతు సాధించకపోతే ప్రత్యేకతేముంటుంది? ఈ విషయాన్ని గుర్తిస్తే అతి తొందరగా తన స్థానాన్ని పదిలపరచుకోగలుగుతాడు కవి.

కవికి మరొక సూచనేమంటే, యిప్పటికే బాగా అరిగిపోయిన పదాలను.... కన్నెప్పలు, గాయం, పెదాలు, సంతకాలు లాంటివి, తన కవిత్వంలో వాడటం మానుకోవాలి. ఒక భావాన్ని వ్యక్తీకరించి, చివరన" గదా (కదా)" అనడం విసుపు పుట్టిస్తుంది. "కదా" అని చెప్పే పద్ధతి బాగా పాతబడిపోయింది. అలాగే—"పుండు" "చీము", "పుష్ప మర్మాంగములో కత్తుల కొసలు పురి విప్పుతున్నాయి" అనడం మానుకుంటే మంచిది.

ఉద్యమాల కాలమిది. ఉద్యమ కార్యాచరణలోంచి వచ్చిన అనుభవాలు, అనుభూతులు, సహజాతమైన కవితారీతిలో కార్యకర్తలు ప్రకటిస్తున్న భావాలు కవితల, పాటల రూపంలో అచ్చయి మన ముందుకొస్తున్నాయి. కార్యాచరణలో కార్యకర్తలే కవులై ఎన్నో కవితా సంపదలను బయటనున్న కవులకు, రచయిత

లకు అందజేస్తున్నారు. పేపర్ పోస్టర్స్, బుక్‌లెట్స్, పాంప్లెట్స్ యానంలో మనముందున్నాయి. అవి కవితా సంపదలకు గనులవంటివి. ఈ గనులను తవ్విన కొద్దీ ఫలితంగానే కావ్య సంపదలను పొందగలగడం సాధ్యమవుతుంది. కవినుండి కవి నేర్చుకొనే కాలం దాటిపోయింది. కవిత్వం రాయాలంటే కార్యకర్తల వద్దకు పోవాల్సిందే, ప్రజాకవి కావాలంటే కార్యకర్తలైన కవుల సహాయంతో ప్రజల వద్దకూ, ప్రజాపోరాటాల చెంతకూ పోవాల్సిందే. ఈ నూతన సాహిత్య యుగలక్షణాన్ని అర్థం చేసుకోవడంలో ముందున్న కవులనే ఈ కాలం ఆహ్వానిస్తుంది. శక్తి సామర్థ్యాలన్నీ వున్న ఏలేశ్వర నాగభూషణాచార్య కృషి సాహిత్య ఉద్యమ కాలావసరాన్ని తీర్చే కర్తవ్యంలో భాగమవుతుందని ఆశిద్దాం.

[నేల తడవని వాన (కవిత). ఏలేశ్వర నాగభూషణాచార్య.
పేజీలు 60- వెల : రు 12- ప్రచురణ : మంజీరా రచయితల సంఘం.
1-1-23 ఫతేనగర్, మెదక్-2, విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు]

---

(30 వ పేజీ తరువాయి)

→ రాజకీయ నాయకులు
రంగులెన్నొ మార్చుకుంట
పూలమాల లేసుకొని
మన చెవుల పూలు బెట్టి
సాగునీరు ఇస్తమని
సారా పాకెట్లు పంపుడాయె ॥వద్దు॥
నెల్లూరు జిల్లలోన
నెలకొన్న సారా పోరు
నెత్తుటి మడుగులైన
సారా అమ్మనియొద్దని ॥వద్దు॥
స్త్రీ విముక్తి బాటలోన
మహిళాలోకం మేలుకొనె
సారా కంట్రాక్టర్ల
ఆస్తులన్ని ప్రజలకె!
స్వంతం చేయాలని
ప్రజలంత కదలినారు.
ప్రజాపోరు బాటలోన
బారులై సాగుతుండ్రు ॥వద్దు॥

—ఆకుల జి.డి.శె.

# యుగద్రష్ట గురజాడ : ఆధునిక తెలుగు నాటకం

—కె. రవివర్మ

(కేరళనుంచి వెలువడుతున్న హిందీ మాసపత్రిక "సాహిత్య మండల్ పత్రిక" ప్రధాన సంపాదకులు కె. రవివర్మ. తెలుగు సాహిత్యానికి మిత్రులు. ప్రజాసాహితి "గురజాడ కన్యాశుల్కం ప్రదర్శన శతాబ్ది" సంచికను ఆగస్టు 92లో వెలువరిస్తున్నామని వారికి ప్రజాసాహితి తెలియజేస్తో, ఈ నాటకం మళయాళంలోకి అనువాదం జరిగిందా ? అయితే ఓ పరిచయ వ్యాసం హిందీలో రాసి పంపమని కోరింది. మళయాళంలోకి అనువాదం కాలే'దని ప్రజాసాహితికి తెలియజేస్తూ, 'కన్యాశుల్కం' పై హిందీలో పరిచయ వ్యాసం రాసి పంపమని వర్మ ప్రజాసాహితిని కోరారు. 'ప్రజాసాహితి' ఆంధ్ర విశ్వవిద్యాలయం హిందీ లెక్చరర్ కృష్ణ గారిచేత వ్యాసం రాయించి పంపించింది. ఆ వ్యాసాన్ని 'సాహిత్య మండల్ పత్రిక' జూలై 1992 సంచికలో ప్రచురిస్తూ, వర్మగారు ఆదే సంచికలో రాసిన సంపాదకీయం "యుగద్రష్టాః ఏక్ తెలుగు నాటక్" తెలుగు అనువాదం ప్రజాసాహితి పాఠకుల కోసం ఈ క్రింద ప్రచురిస్తున్నాము. —సం॥)

విజయనగరం (ఆంధ్ర) లోని జగన్నాథ విలాసినీ సభ అనే సాంస్కృతిక సంఘం కేవలం సంస్కృత నాటకాలే ప్రదర్శిస్తూ వచ్చేది." అలాంటిది వందేళ్ళ క్రితం అదే సంస్థ ఓ తెలుగు నాటకం ప్రదర్శించి, తెలుగు సాహిత్యంలో, రంగస్థలంలో ఓ సంచలనాన్ని సృష్టించింది. ఈ నాటకం యథాస్థితివాదుల, సాహిత్య సమాలోచకుల విమర్శకు గురి అయింది. నాటకం పేరు "కన్యాశుల్కం"-వివాహం పేరిట యుక్తవయసు రాని కన్యల్ని, వారి తల్లిదండ్రులకి డబ్బిచ్చి కొనుక్కోవడం. ఈ నాటకం, దీని రచయిత గురజాడ వేంకట అప్పారావు తెలుగు సాహిత్యంలో శాశ్వత స్థానాన్ని పొందారు.

శ్రీ గురజాడ అప్పారావు విజయనగరం యం. ఆర్. కాలేజీలో ఇంగ్లీషు, సంస్కృత అధ్యాపకులయి నప్పటికీ (తెలుగులో) గ్రాంథిక రచనలు చేసే పద్ధతికి స్వస్తి చెప్పి, ప్రప్రథమంగా తెలుగు నాటకంలో వ్యావహారిక భాషనీ, నుడికారాన్ని ప్రవేశపెట్టారు. అందువల్ల ఈనాడు వారు ఆధునిక తెలుగు సాహిత్యానికి వెలుగుదారి చూపినవారుగా గుర్తింపబడుతున్నారు. 'కన్యాశుల్కం' ఆధునిక నాటక లక్షణాలని తూ.చ. తప్పకుండా అనుసరించి ఉండక పోవచ్చు. అయినా ఎక్కువ శాతం నిరక్షరాస్యులు ఉన్న సమాజంలో భావవ్యాప్తికి మాధ్యమంగా నాటక ప్రక్రియని ఎంచుకోవడం ఎక్కువ ఉపయోగకరంగా ఉంటుంది. చెప్ప దలచుకున్న విషయానికి హాస్యాన్ని జోడించి ప్రేక్షకుల ముందుంచితే అది తన

లక్ష్యాన్ని తస్పక సాధింపచుతుంది. 'కన్యాశుల్కం' నాటకం రాయడంలో శ్రీ గురజాడ ఉద్దేశం సాంఘిక దురాచారాల మూలాల్ని పెకిల్చి చెండాడటం.

కన్యాశుల్కం 1892 ఆగస్టు 13వ తేదీన మొట్టమొదటిసారిగా రంగస్థలం మీద ప్రదర్శింపబడింది. 1897 సం॥రంలో గ్రంథరూపంలో వెలువడింది. నాటకానికి రాసిన 'భూమిక'లో శ్రీ గురజాడ యిలా అన్నారు. "విజయనగరం మహారాజు గారి ఆదేశం ప్రకారం పదేళ్ళ క్రితం నేను బ్రాహ్మణ శుల్క వివాహాలను గురించిన కొన్ని వాస్తవాలను పోగుచేశాను. విశాఖపట్నం ప్రాంతంలో గత మూడు ఏళ్ళగా (1880–83) ఇలాంటి వివాహాలు 1034 జరిగాయి. ఈ సంఖ్య పరిపూర్ణమయినది కాదు. కారణం— తత్సంబంధిత వ్యక్తులు తాము కన్యల్ని శుల్కం తీసుకొని వివాహం జరిపినట్టుగా అందరూ ఎలా ఒప్పుకుంటారు ?"

"పైన ఉదహరించిన అంకెలను గురించి ఒక ఏడాదిలో సగటున శుల్క వివాహాలు 334 జరిగాయి.

99 మంది అల్ప వయసులో, 44 మంది నాలుగేళ్ళ అమ్మాయిలకి, 36 మంది మూడేళ్ళ అమ్మాయిలకి, అరుగురు రెండేళ్ళ అమ్మాయిలకీ, ఏడాది వయసు మున్నపమ్మాయిలకీ శుల్కం తీసుకొని పెళ్ళిళ్ళు జరిగాయి. అమ్మాయిలకోసం తీసుకొన్న శుల్కం 350 రూపాయల నుంచి 400 రూపాయల మధ్య ఉంటుంది. యుక్త వయసు రాకుండానే శుల్క వివాహాలు జరిపించే ఈ దుష్టసాంప్రదాయం ఎంతవరకూ పోయిందంటే— గర్భంలో ఉన్న శిశువుకి సయితం శుల్కం తీసుకొని పెళ్ళి నిశ్చయం చేసుకోవటం దాకా వెళ్ళింది. ఇంతకన్నా అవమానకరమయిన విషయం సమాజానికేం ఉంటుంది ? ఇటువంటి సాంఘిక దురాచారాల ఉన్మూలనకి సాహిత్యం నడుం కట్టాలి. ఈ నాటక రచనకి ప్రేరణ ఈ భావమే.

"శుల్కం లేక వెల యిస్తే ముసలి వగ్గులకి సయితం ముక్కుపచ్చలారని బాలికలు లభిస్తున్నారు. బాల్యంలోనే వైధవ్యం ప్రాప్తించే వీరి చేత యిళ్ళల్లో గొడ్డు చాకిరీ చేయిస్తున్నారు."

కేరళలో నంబూద్రీల (కేరళ బ్రాహ్మణులు) మధ్య సయితం బాల్య వివాహాలు పరిపాటి. అయితే అవి శుల్కం యిచ్చికాక, వరకట్నం ఇచ్చి జరిగేవి. బహు భార్యా వివాహాలు కూడా సర్వసాధారణ విషయం. డబ్బుల అవసరాన్ని బట్టి ఏ కన్యతోనయినా వివాహం జరిపించేసేవారు. ఒక్కో పురుషునికి పలుగురేసి భార్యలు. వాళ్ళ మధ్య పోట్లాటలు, తగవులాటలు అంతఃపుర సవతి కలహాలు సాధారణ విషయం. (నంబూద్రీలు పరదా పద్ధతి పాటించేవారు. పరాయి మగవాని ఎదుటికి వచ్చేవారు కారు.) నంబూద్రి బ్రాహ్మణుల్లో యింటి పెద్ద కొడుకు మాత్రమే నంబూద్రి కన్యలనే వివాహం చేసుకొనేవారు. అందువల్ల కన్యాధారంనుంచి విముక్తి

(తరువాయి 39వ పేజీలో)

# మత్తు నిషేధిద్దాం

సభలు రసాభాస అవుతాయి
కమిటీలు కాలాల్ని దాటుతాయి
వేడిని చల్లార్చడానికి
దిగుతున్న మత్తు నెక్కించడానికి
నిర్వీర్య నిద్రాణ వాతావరణ నిర్మాణం కోసం
సింహాసనాలు తెలివిగా శవాసనాలు వేస్తాయి
అందరూ నిద్రలోకి దిగాక
ఆసనాల్లో సింహాలు లేచి
శవాల్లాంటి మనుషుల్ని పాలిస్తాయి
నిజంగానే రాజ్యం కూడా
మన మాటే మాట్లాడుతుందనుకుంటాం
మన పాటకు గజ్జె కడుతుందనుకుంటాం
మన నుదురు మీద చెయ్యి పెట్టి కడుపు చూసి
వాత్సల్యంతో వాటేసుకుందనుకుంటాం
పగలు గడిచి రాత్రి గడిచి మళ్ళీ
పగలొస్తుంది కదా
అంతా తారుమారయేది అక్కడే
అధికారం మాటకు మత్తెక్కేది మామూలే!
"మీరనేది సబబే కాని ..." అంటూ
చాంతాడు లాగుతుందిక!
మనం చల్లారేదాకా కూలబడే దాకా
కనులు వాల్చే దాకా మృతప్రాయమయేదాకా....
ఇక్కడే
చాంతాడును తెంపాల్సిందిక్కడే
మత్తు మీద మాట తేలాల్సిందిప్పుడే
మందకాదు వేయి మంటలైనా తల కెత్తు కుందాం
లక్ష గాయాలు రేగే అనుభవాలైనా మింగుదాం
కానీ సోయిలేని బతుకుల్తో ఏం బావుకుంటాం?
మత్తు పొరలు కమ్మిన మాటల్ని త్యాజీకరించి
మత్తు తూగే సీసాల వ్యామోహాల్ని ధిక్కరించి
ప్రాణం తొణికిసలాడే శరీరాల్తో
నూరు పాళ్ళ స్పృహతో జీవనోత్సాహం చేయాలి

వ్యాపారం బతుకు పీడి పెక్కు తున్నది
మనకు మత్తిచ్చి ఎవడది వ్యాపారం చేసేది
మన నిద్ర మీద ఎవడది ధనం కలలు కనేది
మన సామూహిక నిస్తేజం కోసం
బంచోబస్తుతో ఎవడది ద్రవ సరఫరా చేసేది
ఇది నిషేధాల కాలం కదా
దేన్ని నిషేధిస్తే బతుకు పరిమళిస్తుందో
దాన్నే నిషేధిద్దాం
మనుషుల కోసం పోరాడే మనుషుల్ని
నిషేధించే ఆధ్యాత్మిక దేశంలో
మనం మనుషుల్ని పాతరేసే మత్తుని నిషేధిద్దాం
మత్తుని విస్తృతించే వలయాల ఉనికినే నిషేధిద్దాం

—దర్భశయనం. శ్రీనివాసాచార్య

---

గల్పిక:

## చదువు

—పుప్పాల కృష్ణమూర్తి

"అమ్మా! నువ్వెందుకు సదూకోలేదే?"
"మీతాత నన్ను సదివియ్య లేదు బిడ్డా!"
"మరి తాత సదూకోలే దానె?"
"మీతాతగాదు, మీ అయ్యగ్గూడా సదూరాదు బిడ్డా!"
"తాతెందుకు సదూకోలేదే?"
"అళ్ళయ్య అడ్ని సదివియ్యలే!"
"మరి సుజాతోళ్ళతాత, పటేల్ రామయ్య సదూకుందుగదనే?"
"వాళ్ళయ్య సదివిచ్చిండు."
"మీతాతోళ్ళ అయ్యెందుకు సదివియ్యలే"
"అళ్ళు సదూకుంటున్నా యింట్లెల్తది. భూవులున్నయ్. ధనువుంది. దాన్నెవుంది. గట్లుంట బట్టి ఏం సదివినా ఏం జేసినా సిక్కుండదు. మన లోటోళ్ళు సదూకుంటూ గూసుంటే యింట్లెల్దదు, బువ్వ దొరకదు. మనం కూలి జెయ్యాలె. మన కష్టం మనం దినాలె.
"సదూకుంటె తెలివొస్తదంట గదనే?"
"అ....వస్తది పందిని పుంచనీకి - ....సర్కారు సొమ్ముదిననీకి...." ●

# కిక్కెందుకురో ?

కిక్కెందుకురో ? నీకు
తిక్కెందుకురో ?
తిక్కెక్కించే సారా
చుక్కెందుకురో ? ॥కి॥

షరాబు నువ్ తాగొద్దు
గరీబుగా మారొద్దు
సారాయీ ఒక నిప్పు
కొంపకు తెచ్చును ముప్పు ॥కి॥

సారాయీ తాగేవు
నిస్సారం అయ్యేవు,
మత్తులోన మునిగేవు
మానవతను మరిచేవు:
సారాజోలికి పోతే
సంకకు జోలే వచ్చు -
సారా తాగకురన్నా !
తాగితె బతుకే సున్నా ॥కి॥

సంపాదన సారపాలు
సంసారం వీధిపాలు,
సారలో నిషా లేదు
నిషాలో పసాలేదు:
కాపుసార తాగకురా !
కాపురాన్ని కూల్చకురా !
తాగననీ ఒట్టు పెట్టు
మద్యాన్కి మట్టు పెట్టు ॥కి॥

సంసారం బాగుండగ
సారా యెందుకు ? దండగ,
నిగ్గుల పెళ్ళా ముండగ

పెగ్గులు ఎందుకు ? దండగ:
ఎందుకు మందూ మైకం ?
కూడ బెట్టుకో పైకం -
పతనం జేసే సారా
వదలు ర ! మనసారా ॥5॥
కల్లు సార మానాలి !
చల్ల గందరుండాలి !
సారాయిని విడువాలి !
ప్రగతి బాట నడువాలి !
మహిళ ఉద్యమించాలి !
మధువు మానిపించాలి !
సారకు చెపుదాం సారీ
అందరం వొకే సారీ ॥6॥

-దూడం నాంపల్లి

( 35వ పేజీ తరువాయి )

కోసం ఆమె తల్లిదండ్రులు ఎంత వరకట్నమయినా సమర్పించుకొని, కాటికి కాళ్ళు సాచుకొన్న నంబూద్రీ వృద్ధునికి సయితం తమ కన్యల్ని కట్టబెట్టేవారు.

ఈ సాంఘిక దురాచారానికి వ్యతిరేకంగా 1930వ దశకంలో నంబూద్రీ యువకులు పెద్ద ఎత్తున ఆందోళనను చేపట్టారు. తెలుగులో 'కన్యాశుల్కం'లా, (మళయాళంలో సయితం) నాటకాలు రాసి ప్రదర్శించేవారు. నవలలూ, కథలూ రాసే వారు. ఈ ఉద్యమం విజయవంతమయింది. సాహిత్యానికి ఉన్న శక్తి ఏమిటో, సంఘసంస్కరణకి సాహిత్యం ఎంతలా దోహద పడగలదో ఋజువయింది.

గిరిజనులలో సయితం ఓలి యిచ్చి కన్యల్ని కొనుక్కొనే ఆచారం ఉందని అంటారు. అయితే చిన్న వయసుగల బాలికల్ని కాదు. వయసు వచ్చిన యువతీ యువకులు పరస్పరం యిష్టపడ్డ తర్వాతనే గిరిజనులలో వివాహాలు జరుగుతాయి. అంతేగాని 'కన్యాశుల్కం' నాటకంలోలాగ ముసలి ముక్కుపచ్చలారని పసికందులతో క్రూరంగా చెలగాటం ఆడుకోవటంకాదు.

—అనువాదం : నిర్మలానంద

## భారతీయ మానవతా !

ఉన్మాదుల దుశ్చర్యలకు
మట్టమైన మసీదుని మరల లేపవచ్చు
ప్రతీకారాగ్రహమున
ధ్వంసమైన దేవళాల్ని పునర్నిర్మించవచ్చు
కెలికిన మనోభావాల గాయాలను
కాలక్రమమున మాన్పవచ్చు
వేలాదిగా కూలిన మానవ ప్రాణాలలో
ఒక్కటైన తిరిగి రప్పించగలరె ?
దురహంకారమున కెదురుతిరిగెడి
ఘన చరిత గల ఓ భారతీయులార !
వేయి మందిరాలకన్న పదినూర్ల మసీదులకన్న
ఒక మానవ ప్రాణం మిన్నయని తలచలేర ?

— దివి కుమార్

---

( 8 వ పేజీ తరువాయి )

గురజాడవారి కలం ఈ సన్నివేశాన్ని ఎట్లా చిత్రించిందో ఒక్కసారి చూద్దాం.

జవాను : రూపాయలందోయ్.

రా. పం :- (మధురవాణితో) యేవీ, మొన్న నీకిచ్చిన రూపాయలు ? సాయంత్రం మళ్ళీ ఫిరాయిస్తాను. యీ సైతాను ప్రాణం తింటున్నాడు.

మధురవాణి :- మీరిచ్చిన రూపాయలు పట్నం తోలేశాను. నేను డబ్బిక్కడ దాచు [illegible] తుంటే మా తల్లక్కడ కాలక్షేపం చెయ్యడమెలాగా ?

రా. పం :- వొట్టబద్దాలు.

మధురవాణి :- (తాళముల గుత్తి మొలలోంచి తీసి రామప్పపంతులుమీద విసిరి) చూసుకోండి.

ఐదు

గుంటూరు శాస్త్రులు వేషంలో ఉన్న కరటకశాస్త్రికి రామప్ప పంతులుకు సుదీర్ఘ చర్చానంతరం చెరిసగం వాటాదగ్గర రామప్ప పంతులు (మాయనుల్లితో) లుబ్ధావధానులు పెళ్ళి ఖరారు చేస్తానని మాట యిచ్చాడు. దొంగ జాతకాలు సృష్టించ డానికి అవసరమైన కాగితాలు, పాత సిరాబుడ్డి, కలం తెమ్మని రామప్ప పంతులు మధురవాణికి చెప్తాడు. కరటకశాస్త్రి కూతుర్ని (శిష్యుణ్ణి) రామప్పపంతులు

ముందుకు నెట్టుతాడు. రామప్ప పంతులు కూతురు చెయ్యి చూస్తుంటాడు. మధురవాణి సిరాబుడ్డి, కలం కాగితాలతో వస్తుంది. కోపంతో రెచ్చిపోయి సిరాబుడ్డిలో సిరా అంతా రామప్ప పంతులు మీద పోస్తుంది— ఈ సిరాపోత చర్య మధురవాణి కోపాన్ని ప్రకటిస్తుంది. మధురవాణి 'సిరాబుడ్డి' నరకం ఇంత మాత్రమే అయితే ఇక్కడ ప్రస్తావించాల్సిన అవసరం ఎంత మాత్రం లేదు. ఈ చర్య వెనుక మరో ప్రయోజనం కూడా వుంది.

మధురవాణికి స్త్రీ వేషంలోని రామప్ప పంతులు శిష్యుణ్ణి చూస్తుంటే రహస్యం ఎక్కడ బట్ట బయలౌతుందో అనే అనుమానం కల్గింది. రామప్పపంతులుకు ఈ విష యం తెలియకుండా చేయాలని మధురవాణి ఆలోచిస్తుంది. ఈలోగా రామప్ప పంతులు సిరాబుడ్డి తెమ్మని మధురవాణిని పురమాయించాడు. మధురవాణి సిరాబుడ్డి తీసుకురావ డానికి లోపలికి వెళ్ళినప్పుడే రామప్ప పంతులు ముఖం మీద సిరా పోసి కరటక శాస్త్రి శిష్యుణ్ణి పరీక్షించే ప్రయత్నానికి అవరోధం కల్గించాలని నిశ్చయించుకొంది. ఆమె సిరాబుడ్డితో రాగానే కరకటశాస్త్రి శిష్యుడి చేతిని చూస్తున్న రామప్ప పంతులు ముఖం మీద కోపంతో సిరాబుడ్డిలోని సిరా వొలకబోసింది. ఈ 'చర్య' జరిగిన మరుక్షణమే తృతీయాంకం రెండో స్థలం సమాప్తమై తెర జారుతుంది.

ఈ సన్నివేశం ఎంత రసవత్తరంగా వుందో చూడండి!

రామప్ప పంతులు : యేదీ పిల్లా ! యిలారా ! చెయి చూపించూ.

(శిష్యుడు భయం నటించి వెనక్కి తగ్గును.)

కరకట శాస్త్రి : చూపించమ్మా ! భయం లే చ్చూపించు.

(కరటక శాస్త్రుల్లు శిష్యుణ్ణి రామప్ప పంతులు దగ్గరికి తోయును. రామప్ప పంతులు చెయ్యి పట్టుకొని అరి చెయ్యి చూచుచుండును. శిష్యుడు చెయ్యి లాక్కొన్నట్లు నటించును. మధురవాణి సిరాబుడ్డి, కలం కాగితం పట్టుక వచ్చి రామప్ప పంతులు వెనక నిలుచుండును.)

రామప్ప పంతులు :- ఆహా ! ధవరేఖా ! సంతాన యోగ్యత బాగా వుంది.

మధురవాణి : మీరు చేపట్టిం తరువాత, అందుకు లోపం ఉంటుందా ?

(సిరాబుడ్డిలోని సిరా రామప్ప పంతులు ముఖం మీద పోసి చర్రున వెళ్ళి పోవును.)

రామప్ప పంతులు ముఖం మీద సిరా పోయడంతో తెర దించటం ఈ దృశ్యానికి కొస మెరుపు.

ఆరు

మాయ సుబ్బి పెళ్ళి (అదే లుబ్ధావధానుల పెళ్ళి) రామప్ప పంతులు ప్రమేయం లేకుండానే జరిగింది. కరటకశాస్త్రి కన్యాశుల్కం చేజిక్కించుకొని ఉడాయిస్తాడు. రామప్పపంతులు కారాలు మిరియాలు నూరతాడు. మధురవాణి పెళ్ళిలో

యేం అప్రతిష్టా ! బ్రాహ్మడికి వెర్రెత్తుతుంది కాబోలు" అంటూంది. రామప్ప పంతులు కొత్త అగ్రహారం పోతాడు. మధురవాణి ఆ రాత్రికి భుక్త, పోలిశెట్టి, సిద్ధాంతి, పూజారి గవరయ్యలను పిలుచుకొని పేకాట ప్రారంభిస్తుంది — ఇంతలో వీధి తలుపు ఎవరో తట్టుతారు. మధురవాణి పంతులొచ్చాడంటుంది. భుక్త, పోలిశెట్టి లను గోడ గెంతి పారిపొమ్మంటుంది— దొడ్డి తలుపుకు తాళం వేసి ఉంటుంది. వాళ్ళు కలవర పడ్తారు. వాళ్ళందరినీ ఓ గదిలో పెట్టి, దీపాలు ఆర్పి తలుపుతీస్తుంది. మధురవాణి రామప్పపంతులు అని చీకట్లో భయపడుతుంది. భయపడుదూ ? కంఠ స్వరం ఆమెకు తెలుసునాయె. మధురవాణిని మెడ పైకెత్తమంటాడు. ఆమె మెడ పైకెత్తగానే ఆమె మెడలో కంటె వేస్తాడు. తీరా చూస్తే యింతసేపు రామప్ప పంతులు లాగా మాట్లాడింది కరటకశాస్త్రి శిష్యుడు. మధురవాణి "ఔరా! ఇంద్ర జాలం" అని వాణ్ని ముద్దాడుతుంది — ఈ సన్నివేశంలో 'దీపాలు ఆర్పే చర్య' రామప్పపంతులుకు మధురవాణీ, భుక్త్యాదులు పేకాటాడుతున్న విషయం తెలియకుండ ఉండటానికని వాళ్లను రామప్పపంతులు చూడకుండా ఉండటానికని నాటకం చదువు తున్న మనకు అర్థమౌతుంది. మధురవాణి 'దీపాలు ఆర్పి' అద్భుతమైన ప్రయోజనం సాధించింది మధురవాణి దీపాలే ఆర్పకపోతే ఖూనీకేసు, కంటె అపహరణలవల్ల ఉత్పన్నమైన 'సస్పెన్స్' (పాత్రల మధ్యనే) నీరుగారి పోయేది. దీపాలను ఆర్పటం వల్ల మధురవాణి మాయసుబ్బి సంగతి, కంటె విషయం చివరకంటా ఎవ్వరికీ తెలియకుండా ఉత్కంఠ రేకెత్తించింది. లుబ్ధావధానుల్ని, రామప్పపంతుల్ని, సౌజన్య రావు పంతుల్ని తలకిందులు చేసింది ఈ "కంటె"నే మధురవాణి దీపాలు ఆర్పి వేయడంవల్ల మధురవాణి 'కంటె' ఆమెకు చేరిందనే సంగతి పేకాటాడిని వాళ్ళ కెవరికీ తెలియకుండా గోప్యంగా ఉండిపోయింది. ఈ చర్య ద్వారా సాధింపబడ్డ గొప్ప ప్రయోజనం యిది. నాటకీయంగా మరో ప్రయోజనంకూడా వుంది. మధుర వాణి, కరటకశాస్త్రి శిష్యుడిపైన వెలుగునీడలు వ్యాపిస్తాయి లైటింగువల్ల. మధుర వాణి మెడలో కరటకశాస్త్రి కంటె వేసే దృశ్యం ఆ చీకట్లో 'లైట్ ఎఫెక్ట్స్' వల్ల చాలా అద్భుతంగా ఉంటుంది. దీపాలు ఆర్పడం వల్లనే "ఈలైటింగ్ ఎఫెక్ట్" సాధ్యపడుతుంది. ఇది గొప్ప డ్రామా టెక్నిక్.

ఈ దృశ్య శకలాన్ని చదివి చూద్దాం:

(తలుపులు తిరిగి తట్టబడును.)

పోలిశెట్టి :- నరశింవ్వా....నీ దివ్వె....

(మధురవాణి ఊరుకొమ్మని కోపరసంగా సౌంజ్ఞ చేయును. సిద్ధాంతి ప్రవేశించును.)

( తరువాయి 45 వ పేజీ )

# వేగుచుక్కలు

అమ్మో దేశం ఘోష పెట్టింది
అన్నల నెత్తుటి ముద్ద జూసి
నెత్తురు ఇంకిన నేల చూసి ॥అమ్మో॥

పచ్చనీ బతుకుల్లో చిచ్చు పెట్టేటి
మత్తులో నిను ముంచి మాయ జేసేటి
మద్య పానీయాలు రూపు మాపుటకు
మీటింగు పెట్టుకొని మాటలాడారు ॥అమ్మో॥

సత్తారు అంటేనే హడలెత్తి నట్టి
సత్తెన్న పేరింటే దడపుట్టినట్టి
శత్రువూ చీకట్లో దారి చూపాడు
దొంగ చాటుగ వచ్చి దెబ్బగొట్టారు. ॥అమ్మో॥

బద్ది పల్లెలోన ఏమి జరిగిందో
చీకటి రాజ్యం కన్ను గప్పిందో
రక్కసి పోలీసు రాజ్యమేలింది
వేగు చుక్కలారు రాలి పడినాయి ॥అమ్మో॥

ఆదరించిన అడవి ఏది మరిచిందో
అడవిలోన ఆకు గాలికెగిరిందో
రక్షణిచ్చిన కొండ గుండె పగిలిందీ
గుండె గూడూ చెదిరి బుగ్గి అయ్యిందీ ॥అమ్మో॥

అన్నలు ఏరని అల్లాడి పోతున్న
తమ్ములెక్కడని తపన చెందూతున్న
అమ్మల అక్కలకు ఏమి చెప్పాలి ?
రాజుకున్న అగ్గి దివిటి చూపాలా ! ॥అమ్మో॥

సామ్రాజ్య వ్యతిరేక పోరాట పుత్రులు
సత్తారు సత్తెన్న సూరన్న పోశన్న
రవి [illegible] పిల్లన్నలు
తెలంగాణ పోరు సాగించిన్నరు ॥అమ్మో॥

-నిశితాసి

సినిమా సమీక్ష :

# "రోజా" కాదిది-హిందూ దురహంకారుల బాజా

— ఉదయ్

'నాయకన్' (తెలుగులో 'నాయకుడు') సినిమా ద్వారా 'మాఫియా' లోకపు అధోజగత్తు బీభత్సాన్ని శక్తివంతంగా చూపించిన మణిరత్నం అటువంటి సామాజిక దృక్కోణాలను సెల్యులాయిడ్‌కు ఎక్కించగలడని అపోహపడ్డాం. "టెక్నిక్ ప్రజల కోసం" అనేంత మహత్తర కర్తవ్యం నేటి సినిమారంగం నుండి ఆశించడం దురాశే గానీ, కనీసం వాస్తవాన్ని చూపెడితేచాలు అనుకోవడంకూడా గగనంగా ఉంది. కేవలం టెక్నిక్ ద్వారా విన్యూత్న దర్శకుడనిపించుకోవడానికి, నూతన కథావస్తువు పేరిట కాసుల వర్షాన్ని కురిపించుకోవడానికి మాత్రమే ప్రయత్నించే దర్శకుల కోవ లోని వాడే ఈ మణిరత్నం. తన సినిమా ప్రేక్షకుల్లో ఎటువంటి భావోద్రేకాలకు లోను చేస్తోందో కనీస బాధ్యత వహించక పోగా, వర్తమాన రాజకీయ, చారిత్రక పరిస్థితులకు మసిపూసి మారేడుకాయ చేసి "రోజా" అనే టైటిల్‌తో ఒక చిత్ర రాజాన్ని దేశం మీదకు వదిలాడు. "రోజా" చిత్రం ద్వారా హిందూ మతోన్మాదుల "అఖండ భారత్" నినాదానికి ప్రచారం, ముస్లింలపై గుడ్డి వ్యతిరేకతకు, కాశ్మీర్ ప్రజల న్యాయమైన పోరాటంపట్ల దుష్ప్రచారానికి పూనుకున్నాడు. కోతికి కల్లు దొరికినట్లు ఈ సినిమాను చూడగానే ABVP వారు "కాశ్మీర్ తీవ్రవాదుల కిరాతకాలను, కళ్ళకు కట్టినట్లు చూపిన 'రోజా' సినిమాకు వినోదపు పన్ను రద్దుచేయాలని ప్రకటనల వాంతి చేసుకున్నారు.

ఇంతకీ ఏముందీ 'రోజా' సినిమాలో?....

పట్టణంలో పుట్టిపెరిగిన రుషికుమార్ అనే క్రిప్టాలజిస్టు ఒక పల్లెటూరు అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని కృష్ణాజిల్లా, కపిలేశ్వరపురం వస్తాడు. పెళ్ళి చూపుల్లో వధువు అభ్యర్థన మేరకు ఆమెకు బదులు ఆమె చెల్లెలు రోజా నచ్చిందని రోజాను పెండ్లాడుతాడు. తన అక్కను కాదన్నాడనే కోపంతోనే రుషితో మాట్లాడకుండా దూరంగా ఉండే రోజాకు అసలు విషయం తెలిసి దగ్గరైన రోజే ఉద్యోగరీత్యా కాశ్మీర్ వెళ్ళాల్సి వస్తుంది. విదేశాల నుండి రహస్య సంకేతాలను అందుకునే తీవ్రవాదుల కోడ్ భాషను డీకోడ్ చేసి మిలటరీకి సహకరించే పనిమీద వచ్చిన రుషి కుమార్‌ను తీవ్రవాదులు కిడ్నాప్ చేస్తారు. 40 మందిని చంపిన గజ తీవ్రవాది వాసీమ్‌ఖాన్‌ను విడుదల చేస్తె రుషిని వదుల్తామనీ, లేకపోతే చంపేస్తామని బెదిరిస్తారు. తన భర్తను తనకు అప్పజెప్పమనీ మిలటరీ కల్నల్ రాయప్ప వెంటపడుతుంది. రోజా. తీవ్రవాదుల చేతుల్లో అనేక (చిత్రాతి) చిత్రహింసలు పొందుతూ కూడా వీరో చిత కృత్యాలు చేస్తూ, తన మూలంగా ఒక పెద్దహంతకుడు (వాసీమ్‌ఖాన్) విడు

దలి కావటాన్ని నిరాకరిస్తాడు రుషి. చివరకు తెలుగు మాట్లాడగల్గిన కాశ్మీర్ తీవ్ర వాది "లియాఖత్" తో వాగ్వివాదం చేసి, 'కాశ్మీరు భారత్‌లో భాగమని, 'తీవ్రవాదిగా' దారి తప్పినావని బుద్ధిచెప్పి మనిషిగా మర్చేసి మంచు కొండల్లో దొర్లుకుంటూ దొర్లు కుంటూ ప్రియురాలి బిగి కౌగిలికి చేరుతాడు. ఇదీ స్థూలంగా చిత్రకథ.

మణిరత్నం తన చాకచక్యంతో నేటి యువతరం కోరుకునే వింత శబ్దాల రొకళ్ళదంపుడు రెహ్మాన్కు శాస్త్రీయ సంగీత సోయగాలు జతగట్టి మెస్మరైజ్ చేస్తూ "నాగమణీ నాగమణీ, సందరాజా ఏమిటాసద్దు ... పట్టెమంచం కిర్రు కిర్రు ....తొలి కోడి కూసే దాకా ఆగదమ్మా" అనే ఏకార్థ బూతు పాటలకు వెయ్యి మెగావాట్ల ఊపుతో బూతు కదలికల డాన్సులతో, నూతన వధూవరుల పడగ్గది సన్నివేశాలతో యువతరాన్ని ఆకట్టుకుని మిగతా కథ ద్వారా కాశ్మీర్ వ్యతిరేక భావజాలాన్ని, ముస్లిం వ్యతిరేకతను, భారత పాలకుల ఆధిపత్య రాజకీయాలను పవిత్ర కార్యంగా వారి మెదడులోకి ఎక్కిస్తాడు. చిత్రంకథలో భాగంగా కొన్ని సందర్భాలలో కాశ్మీర్ గురించి రాజకీయ చర్చ నడుస్తుంది. ఆ చర్చలు ఎంత ఏక పక్షంగా ఉంటాయో

---

( 42 వ పేజీ తరువాయి )

సిద్ధాంతి :- దొడ్డి తలుపు కప్ప తాళం వేసి ఉంది. మన్ని పట్టుకుందామనే పంతులు దొడ్డి తలుపు తాళం వేశాడు.

పోలిశెట్టి :— నరశింవ్వ—సీదివ్య—

మధురవాణి :- (పోలిశెట్టి నుద్దేశించి) ఛస్ (సన్నని గొంతుతో) ఉలక్కుండా పలక్కుండా ఈ గదిలో కూచోండి. అయన పరున్న తరవాత వచ్చి తలుపు తీసి వొదిలేస్తాను.

(దీపములు ఆర్పి, పైకి వెళ్ళి తలుపు తీయును.)

మధురవాణి కరటకశాస్త్రి శిష్యుని తన వ్యూహాలకు సాధనంగా చాలా చక్కగా ఉపయోగించుకుంది. కరటకశాస్త్రి వాడికి అమ్మాయి వేషం వేయించి మేన కోడలు పెళ్ళి తప్పించడానికి మధురవాణిని ఆశ్రయించాడు. మధురవాణి వాడికి దూవరి వేషం వేయించి రామప్ప పంతులు, కరటకశాస్త్రిల తత్వాలచేత తలవాయ గొట్టించింది. కన్యాశుల్కం నాటకంలో మధురవాణి చేష్టలు, మాటలు, నవ్వు, కద లిక, —అన్నీ ఎంతో అర్ధవంతంగా ప్రయోజనాత్మకంగా ఉంటాయి.

మధురవాణి ఆపదలోనున్న వారందరిని ఓ ఒడ్డుకు చేర్చిన దిట్టు. రామప్ప పంతుల్ని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించింది. కరటకశాస్త్రికి సహాయం చేస్తూనే ముతక చీవాట్లు ముద్దుముద్దుగా వడ్డించింది. మధురవాణి తను నమ్మిన వారందరిని కాపాడింది— మధురవాణి ప్రతి చేష్ట బహుళ ప్రయోజనం సాధించిందనే ఈ అంశాన్ని చెప్పిన గౌ. కు కు కృతజ్ఞతలు ఎలా చెప్పగలను ఈ వ్యాసాన్ని వారి స్మృత్యర్థంగా రాయడం తప్ప.

కొద్దిగాబుర్రపెట్టి సినిమా చూస్తే అర్థమవుతుంది. కానీ ఆ కొద్దిగా బుర్రని ఉపయోగించకుండా ఉండాలనే పైన చెప్పిన నీలి వర్ణ, పడగ్గది, రోకలి దంపుడుకి జతవేసిన శాస్త్రీయ సంగీతంతో చిత్రీకరణ!

కల్నల్ రాయప్ప (తెలుగు మిలట్రీ ఆఫీసర్)తో రోజా తన భర్త గురించి మొత్తుకున్నప్పుడు? "నీకు నీభర్తే ముఖ్యమా?.... ఈ దేశం, ఈ మట్టి నీకు ముఖ్యం గాదా? ఈ (కాశ్మీర్) తీవ్రవాదుల గురించి 3 వేలమంది సైన్యం మంచులో, చలిలో ఎందుకున్నారు? వారి భార్యలు వీళ్ళకు ఎంత దూరంలో ఉన్నారో తెలుసా?" అంటూ కాశ్మీర్‌లో శాంతి నేర్పరచే రూపంలో దురాక్రమణ స్థాయిలో తిష్టవేసి అక్కడ అశాంతికి కారణం అయిన మిలటరీ చర్యను సమర్థించాడు. కాశ్మీర్‌లో భారత సైన్యం ఎంతో మంది ముస్లిం మహిళలపై చేస్తున్న మానభంగాలు, విరలించ బడ్డ హిందువుల ఇళ్ళను తాళాలు బద్దలు కొట్టి, ఇళ్ళను వాడుకుని ధ్వంసం, లూటీ చేస్తున్న భారత ప్రభుత్వసైనికుల అరాచకాలను కనుమరుగు చేశాడు.

1. తీవ్రవాదుల రహస్య స్థావరంలో...."మీకేం కావాలి? ఎందుకు నన్ను బంధించారు?" అన్న రుషి ప్రశ్నలకు, "మాకు ఆజాదీ (స్వేచ్ఛ) కావాలి.... మీనుంచి.... మీభారత్ నుంచి ..మా అందరి విముక్తి కావాలి.... మాగడ్డపై పుట్టే ప్రతి శిశువు యొక్క విముక్తికావాలి" అన్న 'లియాఖత్' మాటల్ని బట్టి.

2. జైలులో ఉన్న వాసిమ్‌ఖాన్ వద్దకు తన భర్తను గురించి వేడుకుంటానికి వెళ్ళిన రోజా, "భర్తను వదిలిపెట్టమని మీ వాళ్ళకు చెప్పు.... మాకు పెళ్ళయి ఎన్నోరోజులు కాలేదు. నాభర్త అమాయకుడు.... అసలు మీరు ఎంత మంది అమాయికుల్ని చంపుతారు?" అని తెలుగులో సెంటిమెంటల్ డైలాగ్స్‌లో అడిగితే, "తూ హిందూస్తానీ.... నికల్ జావో యహాసే....ఏ హమారా మక్సద్ హై.... ఏహమారా మంజిల్ హై.... హర్ ఏక్ కాశ్మీరీ కా ఆజాదీ కేలియే ఏ జంగ్ (నువ్వుహిందూస్థానీవి, పో ఇక్కడ నుంచి.... ఇదే మా లక్ష్యం.... ఇదే మాగమ్యం ... ప్రతి కాశ్మీర్ వాడి స్వాతంత్రం కోసమే ఈ యుద్ధం) అని హిందీలో అదికూడా బొంగురు గొంతుకతో వెనుక భయంకర పిశాచాల మ్యూజిక్‌తో అనిపించే డైలాగ్స్‌ను బట్టి........

3. భారత సైన్యం దాడులకు వేరే స్థావరానికి మారే దారిలో రుషి, "నువ్వెంత మందిని చంపావు? పది? ఇరవై? ముప్పై? ఎవరినైనా చంపుతావా? మీ చెల్లిని? మీ తమ్ముణ్ణి? మీ అమ్మను? నాయకుడి ఆజ్ఞ ఉందని అందర్నీ చంపుతావా?" అనే ప్రశ్నల వర్షానికి "ఇది జిహాద్ (పవిత్ర యుద్ధం)....మీ భారత్‌తో పవిత్ర యుద్ధం" అన్న లియాఖత్ సమాధానం బట్టి.......

4. ట్రైయినింగ్‌కని 15-16 సం॥ల ముస్లిం యువకులు సరిహద్దు దాటి పాకిస్తాన్‌కు బయలుదేరుతూ, "కాశ్మీరీ ఆజాదీ కేలియే లడేంగి హమ్" అన్న నినాదాలను బట్టీ ....

కాశ్మీరీ తీవ్రవాదం గురించి ఈ సినిమాలో చూపించబడినది స్వతంత్ర కాశ్మీర్ కోసం పోరాడుతున్న వారిని ఉద్దేశించినదని అనుకుంటున్నాను. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం - "మణిరత్నం"కు చరిత్ర తెలిసే అలా తీశారో, తెలియక పోయినా ప్రైవేటీ కథ పేరుతో రాబోయే కలెక్షన్ల డబ్బుల గలగలల శబ్దంతో అలా తీశారో గాని .... కాశ్మీర్‌లో నేడు జరుగుతున్న ఆందోళన, ఉద్యమం, పోరాటం, పోసి పాలక వర్గాల భాషలో అల్లర్లలో ప్రధానంగా రెండు భాగాలుగా ఉన్నాయి. ఇటు భారత్ దోపిడీ పాలక వర్గాల కబంధ హస్తాల నుండి, అటు పాకిస్తాన్ దోపిడీ పాలక వర్గాల పట్టు నుండి "స్వతంత్ర కాశ్మీర్" కోసం జరుగుతున్న పోరాటం ఉంది ....

కేవలం మత ఉద్రిక్తతలతో (అది కూడా హిందూ మతోన్మాదుల వల్ల రెచ్చగొట్టబడినవే) టెర్రరిస్టు చర్యలతో జరుగుతున్న ఉద్యమం కూడా ఉంది. ఆయా పోరాటాలకు సంబంధించిన సంస్థలు కూడా ఉన్నాయి. (1. జె. కె. ఎల్. ఎఫ్, 2. ఇస్లామిక్ ముజాయిద్దీన్ ముస్లిం గెరిల్లా ఫోర్స్) ఈ రెండు రకాల వాళ్ళను కలగలిపి "కలిపి కొట్టరా కావేటి రంగా" అన్న చందంగా మామూలు ప్రేక్షకుడి దృష్టిలో కాశ్మీర్‌లో నెలకొని ఉన్న పరిస్థితికి ముస్లింలే నేరస్థులని దుర్మార్గమైన అభిప్రాయాన్ని కలుగ చేస్తుందీ సినిమా.

ఈ సినిమాలోని కొన్ని దృశ్యాలు, కొంత కథ "స్వతంత్ర కాశ్మీర్" గురించే అయితే కాశ్మీర్ గురించి చరిత్ర తెలుసుకోవటం అవసరం. 77 శాతం ముస్లిం ప్రజలు, 23 శాతం ఇతర మతాల ప్రజలు ఉన్న జమ్మూ-కాశ్మీర్‌ను అనేక వందల సంవత్సరాలు హిందూ రాజులే పరిపాలించారన్నది దర్శక రత్నం మణిరత్నానికి తెలిసినా, తెలియకపోయినా అది ఒక చారిత్రక వాస్తవం.

బ్రిటిష వాళ్ళు సంస్థానాధీశులకు వేరుగాను పాకిస్తాన్, భారత్‌లకు విడిగాను "స్వాతంత్ర్య" ప్రకటన చేశారు. హిందువులు మెజారిటీగా ఉన్న నిజాం సంస్థానాన్ని, తెలంగాణా పోరాటాన్ని అణచివేత పేరుతో సైనిక చర్యతో భారత్‌లో కలుపుకున్నారు. నెహ్రూ, పటేల్ వత్తిడికి లొంగిన రాజాహర్ సింగ్ ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా కాశ్మీరీ సంస్థానాన్ని భారత ప్రభుత్వంలో కలిపారు. అయితే అనాటి ఒప్పందాలను గానీ వేటినీ అమలు పరచలేదు. షేక్ అబ్దుల్లాను సంవత్సరాల తరబడి జైల్లో పెట్టి నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీని తమకు లొంగివచ్చేవరకు ఎన్నికల్లో పాల్గొననీయలేదు.

(జవహార్‌లాల్ నెహ్రూ కూడా కాశ్మీరీ పండిటే) 90 శాతం భూములకు అధి పతులు. ఇప్పటికీ ఉన్నత ఉద్యోగాల్లో 70 శాతం పైగా హిందూ పండిట్స్ ఉన్నారు. అంటే జమ్మూ-కాశ్మీర్‌లో అత్యధిక సంఖ్యాకులైన ముస్లిం ప్రజలేమో కూలీలుగా, పేదవాళ్ళుగా, మైనారిటీ అయిన హిందూ పండిట్‌లు భూస్వా ములు, ఉన్నతాధికార్లు అన్నమాట. ఈ అంతరం ఎలాంటి అసంతృప్తులకు కారణం అయి వుంటుందో, ఆ అసంతృప్తులకు పాలక వర్గ రాజకీయాలు ఏ రూపమిచ్చి ఎలా పెంచి ఉపయోగించి ఈనాటికీ మండుతున్న కాశ్మీరుగా మార్చారో ఈ సినిమా లోళ్ళకు ఎందుకు ? డబ్బులు, పేరు వస్తున్నాయా, లేదా అనేదే ముఖ్యం. షేక్ అబ్దుల్లా అధికారంలోకి వచ్చాక భూసంస్కరణలు అమలుపర్చి కుటుంబానికి 5 ఎక రాల చొప్పున భూమిని పంచారు. అదీ నేటి అఖండ భారతం గాళ్ళ గగ్గోలు. తమ హిందూ భూస్వాముల వేల ఎకరాలు లాక్కొని అందరికీ పంచారనే బి.జె.పి. వీరం గాలు, భూమి లేని వారుగా, పేదవాళ్ళుగా, విద్య పొందలేని వారుగా, ఉన్న ఉద్యో గాలన్నీ కొద్దిమందిగా ఉన్న హిందూ పండిట్‌లకే పోవటంవల్ల నిరుద్యోగం, ఇన్ని సమస్యల్లో కొలిమి మంటల్లో బొగ్గుల్లా కాశ్మీరీ ప్రజల పరిస్థితి ఉంటే పాకిస్తాన్ దోపిడీ పాలకవర్గం కాశ్మీర్ మాదే, దానిపై మాకే హక్కని ఒక ప్రక్క, .... కాదు కాదు "భారతదేశంలోదే కాశ్మీరు కాబట్టి దానిపై అధికారం మాదే"నని భారత దోపిడీ పాలకవర్గం ఇంకొక ప్రక్క లాగుతుంటే .... 'మేము ఎటు ఉండాలో నిర్ణయించుకోవాల్సింది మేమే'నని "ప్లెబిసైట్" (ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వ హించమంటే అది జరుగకుండా చూడాల్సిన అవసరం ఏమొచ్చిందీ భారత ప్రభుత్వా నికి ? 'మేము స్వతంత్రంగా ఉంటాం' అని "అజాద్ కాశ్మీర్" ఉద్యమం రేగింది. ఈ స్థితిలోనే జాతుల స్వయం నిర్ణయాధికారాన్ని అభ్యుదయవాదులూ, ప్రజా స్వామిక వాదులు- అందరూ అంగీకరిస్తారు. అదే సమయంలో తీవ్ర అసంతృప్తుల నుండి, పాలక వర్గాల సృష్టినుండి తీవ్రవాదం రేగుతుంది. అటువంటి తీవ్రవాద కాశ్మీరు గెరిల్లా సంస్థలు కూడా ఉన్నాయి. ఇంత లోతు విషయాలు సాధారణ ప్రజ లకు తెలియనివ్వకుండా చేసిన పాలక వర్గం .... కాశ్మీరీ అజాదీలకు వ్యతిరేకంగా దుష్ప్రచారం చేస్తూ తన దురాక్రమణ వాదాన్ని బలపర్చుతుంటోంది. దానికి ఈ సినిమా ఎంతైనా దోహదపడేదే.

డైలాగ్ కంటే, ఉపన్యాసం కంటే, ఉపన్యాసం కంటే, వ్యాసం కంటే, దృశ్యంగా చూపెడితే అది చాలా శక్తివంతంగా, బలంగా ముద్ర వేస్తుంది. అది మణిరత్నం లాంటి చేతులు తిరిగిన వారి ద్వారా ఈ సినిమాలో కొన్ని దృశ్యాలు ఎటువంటి భావావేశానికి లోను చేసిందో చూడండి. వాసీమ్ ఖాన్‌ను విడుదల చేయ డానికి భారత ప్రభుత్వం తిరస్కరించిందని కబురుతో ఒక గెరిల్లా వస్తాడు. అప్పుడు

లియాఖత్ నమాజ్ చేస్తూ ఉంటాడు. తన ధ్యాసంతా అల్లా మీదే లగ్నం చేస్తుంటాడు. ఆ గెరిల్లా ఉద్రేకం పట్టలేక భారత జాతీయ పతాకానికి నిప్పంటిస్తాడు. నమాజ్‌లో ఉన్న లియాఖత్‌కు ఇది తెలియదు. ఎదురుగా చేతులు కట్టిపేయబడిన బందీ, రుషికుమార్ ఒక్క ఉదుటున సింహనాదం చేస్తూ తలుపులు బద్దలు కొట్టుకుని, పరుగు పరుగున వెళ్ళి, పతాకం తగులబెడ్తున్న గెరిల్లాను తన్ని, దగ్ధం అవుతున్న పతాకంపై పడిపోయి, పొర్లుతూ ఆర్పుతూ ఉంటాడు. అల్లా పైనే దృష్టి కేంద్రీకరించిన లియాఖత్ చెవులకు ఈ గొడవేమీ చేరదు. మంటలార్పేసే రుషి కుమార్‌ను చూసి ప్రేక్షకుల్లోంచి ఆవేశపూరిత చప్పట్లు ... నా వెనుక కూర్చున్న కొందరు మహిళా ప్రేక్షకులు నమాజ్ చేసుకుంటున్న లియాఖత్ స్క్రీన్ మీదకు వచ్చినపుడు "అసలువీడిని చంపేస్తే బాగుండు" అని అనడం విన్నాను. చూశారా ఎంత దురహంకారాన్ని ఇలాంటి దృశ్యాల ద్వారా రెచ్చగొట్టవచ్చో? పాకిస్తానీ పతాకాన్ని హిందూ దురహంకారులు కూడా తగులబెట్టారని, హిందువుల్లోనే అగ్ర మతోన్మాదులు బి.ఆర్. అబేంద్కర్ విగ్రహాలను అవమానపర్చడం, బైబిల్‌ను తగులబెట్టారని ఆ సమయములో ఈ ప్రేక్షకులకు గుర్తేరాదు. అసలీ విషయం కూడా తెలియని వారు ఎందరో.

మరో సన్నివేశం కూడా ఇలాంటి దురహంకారాన్నే రెచ్చగొట్టేలా ఉంటుంది. భారత ప్రభుత్వం తమ అంశ ప్రకారం వాసిమ్ ఖాన్‌ను విడుదల చేయాలంటే రుషి కుమార్ బ్రతికి ఉన్నట్లు సాక్ష్యం కావాలని కోరారని 'నువ్వు మాట్లాడాలి' అని టేప్ రికార్డర్ ఆన్ చేస్తారు. మాట్లాడమని వత్తిడి చేస్తారు. కొడతారు. మాట్లాడకుండా 'జైహింద్' అని అంటాడు. దానికి ఇంకా కొడతారు. మొహం అంతా రక్తసిక్తం అయిపోయేదాకా, స్పృహ పోయేదాక 'జై-హింద్' అంటూనే ఉంటాడు. వాళ్ళు కొడుతూనే ఉంటారు. ఈ సన్నివేశం అప్పుడు కూడా ప్రేక్షకుల్లో ఆవేశపూరిత చప్పట్లు, ఈ "జై హింద్" లోనే 'హిందూరాజ్యం వర్ధిల్లా'లనే అర్థం వుంది. ఒక మతానికి ఉద్దేశించినదే అది — నేటి మన పాలకులు సెక్యులర్ హీరోలమనుకునే చాలామందికి తెలుసో, తెలియదో గాని "జై....హింద్" అనడం మనం వినడం రొటీన్ అయిపోయింది కదూ.

ఇంకా ఈ సినిమాలో వచ్చిన ప్రస్తావనల్లో "ఎంత మందిని మీరు వెళ్ళగొట్టారో .... ఇళ్ళులేనివారుగా చేశారో ఇలాంటి డైలాగులన్నీ కాశ్మీర్ హిందువులను వెళ్ళ గొట్టేస్తున్నారనే బి.జె.పి బాపతు ప్రచారాలే తప్ప వాస్తవంగాదు. పాలక వర్గాలే పంపించిన హిందువులచే వారే ఏర్పాటు చేసిన గుడారాల్లో ఉంచబడ్డవారు.... హిందూ భూస్వాముల హింసలకు, దౌర్జన్యాలకు పారిపోయి వచ్చిన పేదవాళ్ళతో నిండిన గుడారాలనే కాందిశీకుల శిబిరాలని నామకరణం చేశారు.

మేధావులకు అనేక పౌరహక్కులసంఘాలకు, నిజనిరూపణకమిటీలకు కాశ్మీర్ పర్యటనల్లో అనేక మంది ప్రజలు చెప్పిన వాస్తవాలివి. హిందువులే తమ ఇళ్ళకు,→

## వేకువ పిట్టల గొంతుల్లో...

వేకువ పిట్టల గొంతుల్లో రణ గుణ ధ్వని
కళ్ళు తుడుచు కుంటూ బాల సూర్యుడు
మెల్లెక్కుతూ; శిశిర పత్రాల హిమ బిందువులతో
మొగం తుడుచుకుంటూ;
దారి పొడుగునా పరచుకొన్న
మృత్యు బీభత్సానికి ఒణికి పోతూ....
మబ్బుల శూన్యం దైన్యమెల్లు పొడుగుచూ
దశదిశలా విషాద రుధిరం క్రక్కుతూ-గాంభీర్యం !
ఆవేళ నేను తేనె కలిపిన నిమ్మరసం
నిమ్మళంగా చప్పరిస్తూంటే - పలక మారింది.
గొంతులో మంటలు; నసాళం వరకూ వ్యాపించి
దగ్గూ కన్నీళ్ళూ ముంచెత్తగా
లిప్తలో చావు తప్పింది....
నిమ్మరసం సువాసనలో ఏదో జ్ఞాపకం
చటుక్కున మనసుకు తగిలి, గుండె రగిలి
నేరుగా నరాల రక్తంలోనే లయిస్తూ....
పోలీసు రాణా సృజనాత్మక శక్తి నంతా కేంద్రీకరించి
కల్పనా చాతుర్యంతో ఎన్‌కౌంటర్ కథలల్లుతూ,
మైసూర్ దర్శకత్వంలో ప్రహసనాలు రచించి
మఘవ ధనార్జన శ్రీకంకిత మిస్తూ.... →

---

→గుళ్ళకు తాళాలువేసి, ఆ తాళాలు ముస్లిం పొరుగు వారికే ఇచ్చి కాందిశీక శిబిరాలకు వెళ్ళారు అని ఆ తాళాలు చూపించారు కూడా. ఈ సినిమా చూసేవాళ్ళలో ఈ విషయాలు కూడా ఎందరికి తెలుసు ?

ఇంతటి ఏక పక్షపాతంతో, హిందూ మతోన్మాదుల "అఖండ భారత్" వినా దానికి దన్నుగా, అయోధ్యలో హిందూ మతోన్మాదపు కైపెక్కిన కొందరు బాబ్రీ మసీదును కూల్చిన నేటి నేపథ్యంలో, ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టే హిందూ మత దురహంకారాన్ని రెచ్చగొట్టే పవిత్ర కర్తవ్యాన్ని ప్రేమ, అశ్లీల పాటల, బూతు స్లైన్స్, పడగ్గది సీనుల మసాలాలతో నిర్వర్తించిన "మణిరత్నం" సినిమా ఈ రోజా!! ప్రాంతీయ ఆధిపత్యవాదపు భారత పాలకుల దురహంకార రాజకీయాలకి బాజా ! దీనికి జాతీయ సమైక్యతా అవార్డు ఇచ్చినా అవాక్కవ వలసిన పనేలేదు. ●

వినిపించీ వినిపించనంత మెల్లగా
ప్రక్కయింట్లోంచి చెవిని పడుతూన్న రహస్యాలలో
నీ పేరే - చప్పున తప్పుకుంటూ
ఠణాయి ధారగుండె లోతుల్లోంచి —
ఏవో సనసన్నని స్పర్శానుభూతి !
అసలు నీ పేరు మా ప్రక్క ఇంటి కెలా వచ్చిందో అంతు పట్టదు !

ఆకాశం నిండా పిట్టలు క్రమ్ముతూ
అలజడిగా ఆర్తనాదాలు రాలుస్తూ
అశోక వృక్షా లెక్కడా కనిపించక
రకరకాల శాఖలపై పిదిగడం తిరస్కరించి
చక్రభ్రమణం చేస్తూ - శూన్యంలో గుండ్రంగా
కన్నీటి సుడి గుండాల్లో....
ఇంతకీ యిది శ్రవణేంద్రియానుభవమా ?

త్వగింద్రియానుభవానికి — పురావాసనల జాగృతికి
ఎక్కడిదీ రక్త సంబంధం ?
గుండెల్లో గుబులు కొనే
రహస్యస్వాప్నపుపులు పగులుతూ....
కొమ్మల కొసలు సుతారంగా కదలి
వాయు ప్రసరణం రికార్డు చేస్తున్నపుడు
నీ ఊర్పుల ప్రకంపనాలే —గోచరిస్తూ
సంచరించే నీ ఊపిరులే —

కంటికి చల్లని కర్పూర స్పర్శగా....
దేహంమీద మాత్రం కాగడాల మంటలు ప్రాకినట్లు....
నీకో - కన్నీళ్ళ తడీ, మంటల వేడి ఏదీ పట్టదు
నిరంతర సత్యానికై .. పరిశోధక భవితవ్యానికై....
భవ్యతాపయ వ్యవస్థ కోసం నెత్తురు కాల్చి
ప్రేగులు ప్రేల్చి, అక్షరాల సాక్షిగా — ఏకాంత పథికా !
కొమ్మల చివరి కొసలు నాజూకు కదలికల్లో కన్నీళ్ళు
చల్లని స్పర్శ మెత్తగా శరీరాన్ని తాకితే నీ మునివ్రేళ్ళు
అది ఒక కవితానుభవ ప్రభంజనమా ?
తుషార గంధర్వ సునాద ప్రతి ధ్వానమా ?
ఏక కాలంలో భిన్నానుభూతుల్ని మేళవిస్తూ ....
దుష్కరంగా పుష్కరంగా నువ్వు హత్య చేయబడ్డాక

తీతువుల్లా అరుస్తూ, ఎర్ర బట్టలు ఎవడి కక్షనో తీర్చుకున్నాక
వేకువ పిట్టలు నీ రూపమే కన్నుల్లో నిలుపుకొని
శూన్యాకాశంలో పక్షులు కొడుతూ, పలకరిస్తూ ....
ఈ ఉషోదయం ప్రసవించిన అరుణ కాంతులు
ఇలాగే — నీ వెనకాలే
వేళగాని వేళలో కవిత్వం సహస్ర ముఖీనంగా
ప్రవర్తిల్లుతుందా ? ప్రసరిస్తుందా ?
ప్రవహిస్తుందా అశ్రు తరంగమై ...
కను రెప్పల జిప్పు లాగిన వాడెవడు ?
జిహ్వ నుంచి హృదయానికి — రస ప్రసరణ యాత్ర
చిత్ర గతులుగా సాచించిన వాడెవడు ?
సిద్ధాంతాల పడిగట్టు రాళ్ళతో దెబ్బలు తినీ తినీ
మానవత్వం గాయమై, ఛిద్రమై, హతమై —
అదృశ్యమైనపుడు ఎన్ని గుండెలు నీ చుట్టూ
చక్ర భ్రమణం చేస్తున్నాయో ?
తప్పదు, తప్పదు ! అక్షరాలు పగపట్టక మానవు
కుక్షింభరుల పొట్టలు చీల్చక తప్పదు ....
అక్షరాల్ని నమ్ముకున్న వాడెన్నటికీ ఏకాకి కాదు !
సిద్ధాంతాలు ఉద్యమాల్ని తూచాలి; గుండెల్ని కాదు !
ప్రాణాల్ని కాదు, మానవత నసలే కాదు !
మానవత్వానికి సహ ధర్మచారిణి కవిత్వం
ఎవరు కొలవ గలరీ పార్థివ వైభవాన్ని ?
మానవతకీ మమతకీ కొలగారాలూ కాటాలూ లేవు
అజ్ఞాత స్మృతి పథం సర్వ చైతన్యానికీ రాహు గ్రహణం !
నీ హత్య ఏకాంత రహస్యంకాదు
యాదృచ్ఛిక మసలే కాదు;
కిరాయి కింకరుల కర్కశ హృదయం
అభూత కల్పన లల్లగలదు !
రసూల్ జీ !
ఏమైనా ఇది ఆరంభమే —అంతంకాదు
జోహారులందుకో రసూల్ జీ ! అల్ విదా, అల్ విదా!

-డా॥ సోమసుందర్

[రచన : 12—1—1992 హైదరాబాద్ లో]

# రసూల్ భాయి స్మృతిలో

నిజాలు రాసిన రసూలు భాయిని
కాల్చి సంపినారా ఖాకీలు
కాల్చి సంపినారా
సత్యం రాసిన కలం యోధుని
కాటువేసినారా ఖాకీలు
కాటు వేసినారా ॥ని॥

పాలకుల అవినీతిని జూపి
బడుగు జీవులకు దగ్గరయ్యెను
పేద ప్రజల బతుకులు సదివి
గుడిసెవాసుల గోడులు రాసెను
గుడిసెవాసుల గుండెల్లోనా
నిలిచిపోయెనన్నా రసూలు
నిలిచి పోయె నన్నా ॥ని॥

కలం ఎత్తి ఆ కబ్జాదారుల
రంగుల గుట్టును రట్టు జేసెను
నిజాలు దాచే ప్రభుత రీతిని
పత్రిక ద్వారా ప్రజలకు చెప్పెను
న్యాయం కోసం ప్రాణమిచ్చిన
త్యాగ మూర్తిరన్నా రసూలు
త్యాగమూర్తి రన్నా ॥ని॥

రక్తం తాగే పోలీసోల్లు
కబ్జాదారుల తొత్తులైరి
డబ్బుకులోబడి దొర్రలు పెంచి
రసూలు భాయిని పట్టుకొన్నరు
ఎన్‌కౌంటర్ పేర రసూలు భాయిని
కాల్చి సంపినారా గుండెలో
తూట పేల్చినారా ॥ని॥

రసూలు భాయి కన్నకలలు
ఫలించెదాక నిద్రపోముగా
పరద చాటున పాలకులు జేసే
గ్యారడీలను ఎత్తి రాస్తము
హత్యలు జేసే పోలీసోల్లను

ప్రజల ముందే దోషుల్ని జేస్తం
ప్రజాశక్తితో మమేకమయ్యి
కలం ఎత్తుతామో రన్నా గళం ఎత్తుతామో ॥ని॥
పత్రిక స్వేచ్ఛను కాపాడుటకై
జర్నలిస్టుల మొక్కటైనాం
ప్రజాస్వామ్య పరిరక్షణ కొరకై
కలాలెత్తి పోరు జేస్తం
కలాలపై కత్తుల వేటు
సాగదింక సాగదాని
కదిలినామురన్నా నేడు సాగినామురన్నా
బడుగు జీవులతో గొంతులు కలిపి
పోరు జేస్తమన్నా దోపిడి కూల దోస్తమన్నా ॥ని॥ — ప్రతిన్

---

## 'సారా నిర్మూలన' పై పాటలు గేయాలు తదితర రచనలకై విజ్ఞప్తి

సారా నిర్మూలనకై తెలుగు, హిందీ, ఉర్దూ భాషల్లో కలిపి ఒక కవితల సంకలనం ఎంతో అవసరం వుంది. పేద ప్రజలకు అర్థమయ్యే ప్రజల భాషతో పాటు, ప్రజల సంస్కృతి ఆచార వ్యవహారాలను, బాణీలను, నుడికారాలను ఒడిసి పట్టి రాసే పాటలు, గేయాలు, తేలిక పద్యాలు, వచన కవితలు, పాటల రూపకాలు మొదలగునవి కోరుతున్నాము. సారాను నిషేధించాలని కోరే రచనలు సారా నిషేధంతో కాలం తీరినవైపోతాయి. అందువల్ల సారా నిషేధం విధించాక కూడా సారా నిర్మూలనకై సామాజిక, తాత్విక, సాంస్కృతిక నైతిక, ఆర్థిక భావజాల రంగాల్లో సాగాల్సిన ప్రచారోద్యమం గురించిన రచనలు ఎక్కువ అవసరం. మీరు రాసినవి, అచ్చయినవైనా, కొత్త రచనలైనా పంపగలరు. మీ దృష్టికి వచ్చిన రచనల్ని కూడా ఆయా రచయితల పేరపంపి సహకరించగలరు జనవరి 20వ తేదీలోగా అందిన రచనలు ప్రథమ ముద్రణలో చోటు చేసుకొంటాయి. పుస్తకం ఫిబ్రవరి రెండో వారంలో కరీంనగర్‌లో జరిగే ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్య వేదిక ప్రథమ మహాసభల్లో ఆవిష్కరించబడుతుంది. అందువల్ల ఆలస్యంగా అందినవి రీ ప్రింటులో చేరుస్తాము. మా యీ ప్రయత్నానికి అందరు సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాము.

— బి. ఎస్. రాములు

రచనలు పంప వలసిన చిరునామా: 1-1-262, వీక్లి బజార్,
జగిత్యాల — 505327, కరీంనగర్ జిల్లా.

## చైతన్య వాహిని :

### హైదరాబాద్‌లో :

30. 12. 92న జనసాహితి, అరుణోదయ, విరసం, జననాట్య మండలి సంస్థలు సంయుక్తంగా సుబ్బారావు పాణిగ్రాహి వర్ధంతిని 'మత తత్వ వ్యతిరేక దినంగా' జరిపాయి.

జనసాహితి జంటనగరాల యూనిట్ కన్వీనరు ప్రవీస్ అధ్యక్షత వహించిన ఈ సభలో వరవరరావు, కాకరాల, నారాయణస్వామి, కన్నాభిరాన్, హరిగార్లు మాట్లాడారు. మతతత్వానికి వ్యతిరేకంగా ఐక్య పోరాటానికి పిలుపు ఇచ్చారు.

— బాబ్రీ మసీదు స్థలం ముస్లింలకు చెందాలనీ,

— బి. జె. పి., వి. హెచ్. పి, భజరంగ్ దళ్‌లపై నిషేధాన్ని ఎత్తి వేయాలని తీర్మానించారు.

— కాంగ్రెసు సూత్రధారిగా బి.జె.పి. తదితర పార్టీలు, సంస్థలు పాత్రధారులుగా బాబ్రీ మసీదు కూలగొట్టడం జరిగిందని వక్తలు వివరించారు.

— అల్లర్లలలో ప్రాణాలు కోల్పోయిన వారికీ, నష్టపోయినవారికీ నష్ట పరిహారం చెల్లించాలనీ,

— రాజ్యహింసను వ్యతిరేకిస్తూ కూడా తీర్మానించారు. సభలో అరుణోదయ కళాకారులు సాంస్కృతిక ప్రదర్శనలు యిచ్చారు.

### అరుణోదయ, విజయవాడ దళం :

* నవ భారత యువజన సంఘం (NYO) నిర్వహణలో డిసెంబర్ 18న చల్లపల్లి రామానగరంలో "అప్పుల భారతం", "శబ్దం", 21న విజయవాడ నగర సభలో "రామ జన్మభూమి కాదురో", 23న చందర్లపాడులో హైస్కూల్ ఆవరణలో జరిగిన బహిరంగ సభలో 'శబ్దం' వీధి నాటకాలను ప్రదర్శించారు.

★ సకాలంలో రచనలు అందకపోవడంవల్ల ఈ నెల "పిల్లల ప్రపంచం" ప్రచురించలేక పోతున్నాం. — సం॥

* జనవరి 3, 4, 5 తేదీలలో అనంతపురంలో పి.డి.యస్.యు. నిర్వహించిన "భారత దేశంలో కుల వ్యవస్థ-దళిత సమస్య" పై రాష్ట్ర సెమినార్‌లో అరుణోదయ కళాకారులు దళిత సమస్యపై, కులతత్వంపై, మతోన్మాదంపై అనేక పాటలు పాడారు. మొదటి రోజు రాత్రి మచిలీపట్టణ అరుణోదయ కళాకారులు "ప్రతిభా... ఓ ప్రతిభా" (రిజర్వేషన్ల సమస్యపై), రెండవ రోజు రాత్రి ప్రకాశం జిల్లా పలుకూరు అరుణోదయ - కళాకారులు "నర మేధం" (దళిత పోరాటంపై), అరుణోదయ విజయవాడ దళంచే "రామజన్మ భూమి కాదురో", మూడవ రోజు బహిరంగ సభలో విజయవాడ దళంచే "అప్పుల భారతం" వీధి నాటకాలను ప్రదర్శించారు. అనంతపురం బాల కళాకారులు "జనంపాట" "అదిగోరా తూరుపు" "నగారే హే నగా" డ్యాన్సులు ప్రదర్శించారు.

**అరుణోదయ, ప్రకాశం జిల్లా :**

* డిసెంబర్ 16న పి.డి.యస్.యు. ప్రకాశం జిల్లా మహాసభ కందుకూరులో జరిగింది. ఈ సందర్భంగా జరిగిన బహిరంగ సభలో పలుకూరు, కందుకూరు, అరుణోదయ "రైతునృత్యం" పలుకూరు అరుణోదయ బృందం "రామ జన్మభూమి కాదురో" వీధి నాటకాలను ప్రదర్శించారు.

డిసెంబర్ 30న పలుకూరు దళం శిబిరం నిర్వహించుకొని నేర్చుకున్న "నర మేధం" మొదటి ప్రదర్శన తమ ఊళ్ళో ప్రదర్శించారు. ●

---

★ వచ్చే సంచికలో ...

కెన్యా నవలా సమీక్ష "మట్టికాళ్ళ మహారాక్షసి"
సమీక్షకుడు : గోపరాజు నారాయణరావు.

Edited, Printed and Published by K. RAVI BABU on behalf of JANA SAHITI (A.P.). at Chaitanya Printers, Vijayawada-2. for Co-operative Press, Vijayawada.
Working Editorr : NIRMALANANDA

# ప్రేక్షకుడు కన్ను మూశాడు!

(కవి అఫ్సర్‌కి జనసాహితి, అరుణోదయ వేస్తూ సంస్థలు వస్తున్న వీధినాటకాలను గురించి లోతుగా తెలుసు- ఆ నేపథ్యంలో రాసిందే ఈ కవిత -సం॥)

నా మొహానికి
రంగులు పూసే సప్త గమ్మత్తో విసిగిపోయాను
నా కాళ్ళకి చేళ్ళకి గోడికట్టే
మూడు వేళల 'చప్పట్'తో అలసిపోయాను
నన్ను ఆడని మాటల మధ్యా
నన్ను కట్టేసిన కదలికల మధ్యా
నేను 'మోస' పాత్రనయ్యాను

నాలుగు వీధులూ కలిసే చోట
ఇప్పుడు నా పాత్ర మారింది
ముసుగులేని రంగుల్లేని భాష నాది
మనిద్దరి మధ్యా
ఇక తెరలూ హంగూ ఆర్భాటాలూ అక్కర్లేదు
నన్ను నేను సరికొత్తగా వెతుక్కోడానికి
నన్ను నేను సరికొత్తగా ఆవిష్కరించుకోడానికి
గోడలు కూల్చేసిన చౌరస్తాలో నిలబడ్డాను

ఇప్పుడు
ఆడబోయే నాటకంలో నేను మరెవరో కాదు
నేను కచ్చితంగా నేనే

ఇప్పుడు
ఆడబోయే నాటకంలో నువ్వు మరెవరో కాదు
నువ్వు కచ్చితంగా నువ్వే
ఈ నాటకంలో నేను నటుణ్ణి కాదు
నువ్వు ప్రేక్షకుడివీ కాదు నీకు గొంతునిస్తున్నాను
నీకు కదలికనిస్తున్నాను నీకు ఆలోచననిస్తున్నాను
ఇప్పుడు మన కళ్ళకి కట్టిన గంతలన్నీ తీసి
ఈ నాటకానికి చరమాంకం పాడదాం!
మన పాత్రల్ని మనమే న్యాయంగా ఆడదాం!
(రవికుమార్‌కీ, ఉదయ్‌కీ)

—అఫ్సర్

( 3-1-93 ఆదివారం 'ఉదయం' సౌజన్యంతో)